

బహుమతి
పొందిన వ్యాఖ్య

రూపులు వేరైనా...

పంపినవారు :
యస్. వి. ఆర్. పట్నాయక్, ఖర్గపూరు

# చందమామ

## ఈ సంచికలో



ఇవిగాక:

ఇంకా హాస్యకథలు, రంగులబొమ్మ కథ - ఫోటో శీర్షికల పోటీ, చిత్రకథ, వార్తలు - విశేషాలు మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

---

"చందమామ"లో పాఠకులు పంపే కథలూ, హాస్యాలూ బాగుంటే వేసుకుంటాము. "చందమామ"లో ప్రచురణార్థం పాఠకులు మంచి బొమ్మలనూ, కార్టూనులనూ, కార్టూను కథలనూకూడా పంపవచ్చు. రచనలూ, బొమ్మలూకూడా స్వతంత్రంగా రచించినవై ఉండాలి.

చందా వివరములు:

చందమామ (ఏ భాషలోనైనా)

విడి సంచిక 0-6-0 సంవత్సర చందా రు. 4-8-0

VS. 8707 (Rev.)

# 501 ఉతుకు సబ్బులు ఇంటివద్ద ఉతుకు పనిని తేలిక చేయును




స్వదేశీని కొనండి. భారత పరిశ్రమను బలపరచండి.

పిల్లలకు ఆనందమును కలిగించే

## చందమామ

# 'జహ్నమాము'

అనే పేరుతో

ఈ జనవరి '56 నుండి

ఒరియాభాషలో వెలువడుతున్నది.



ఏజన్సీ షరతులకు వ్రాయండి.

| | | |
|---|---|---|
| విడిసంచిక | .... | 0-6-0 |
| సంవత్సర చందా | రు. | 4-8-0 |



ఒకేసారి తొమ్మిది భాషలలో వెలువడే పత్రిక ఇది ఒక్కటే!



బెంగాలీ, సింధీ భాషలలో కూడా చందమామ త్వరలోనే రానున్నది

## చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు - 26






## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

## 'చందమామ' కు ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

చందమామ పబ్లికేషన్స్

వడపళని, మద్రాసు - 26

# ఇదిగో క్రొత్త

# బ్రౌనీ 'క్రెస్ట్'

ఈ బ్రౌనీ 'క్రెస్ట' కెమేరాతో చిత్రములు తీస్తే అవి చక్కగా వస్తాయని మీరు నమ్మవచ్చును. దీనిని వాడుట ఎంత సులభమంటే. స్పష్టమైన లెన్సు మాదిరి వ్యూఫైండర్‌లో చూచి. దృశ్యమును గురిచూసి. మీట నొక్కితే చాలును!



వ్రేలితో నొక్కి దివ్యమైన పోట్రయిట్‌లు తీయుటకు లెన్సు సరి చేసుకోవడము లేక రమణీయమైన బయటి దృశ్యమునకు ఫిల్టర్ జత చేయడము కాని చేయవచ్చును. 'క్రెస్ట' కెమేరాతో 'కోడక్' ఫ్లాష్‌హోల్డర్ జతచేసి తేజోవంతమైన స్నేపులు తీయవచ్చును. కనుక చీకటి పడిన తరువాత కూడ మీ యింటిలోనే అద్భుతమైన కుటుంబ చిత్రములు తీయవచ్చును!

ఈ కెమేరా ఎక్కువ పొదుపు చేకూరుస్తుంది—'కోడక్' 120 ఫిల్మ ప్రతి రోలు మీద పన్నెండు పెద్ద స్నేపులు మీరు తీయవచ్చును. మీ కోడక్ డీలరుని చూడండి. అనేక రకముల సుందరమైన 'కోడక్' కెమేరాలలో మీరు ఎంచుకొనుటకు అతను సహాయపడును.



## 'బ్రౌనీ' 127 కెమేరా

ఇది వాడుటకు ఎంతో సులభమైనది, అన్నిటిలోకి ధర తక్కువ! మీరు పెద్ద. స్పష్టమైన వ్యూఫైండర్‌లో దృశ్యమందు లక్ష్యముంచి మీట నొక్కితే చాలును .. రు. 17/8
కాన్వాసు కేసు .. .. రు. 3/4

## 'బ్రౌనీ' రిఫ్లెక్స్ కెమేరా

ఈ జనప్రియమైన రిఫ్లెక్స్ మోడలులో దాం పెద్ద వ్యూఫైండర్ ఉంది. దీనితో సరిచేయడములు లేవు. ఊరికే దృశ్యమందు లక్ష్యముంచి మీట నొక్కడమే. ఇంటిలో చిత్రములు తీయుటకు ఒక 'కోడక్' ఫ్లాష్ హోల్డరు జత చేయాలి.

కేసుతో సహా రు. 45/-
ఫ్లాష్‌హోల్డర్ రు. 29/-



## కోడక్ 'డ్యూవాఫ్లెక్స్' II కెమేరా

ఈ అందమైన కెమేరా ఆకర్షణీయమైన క్రొత్త డిజైనుతో, వాడుటకు సులువు, నమ్మకముగా పని చేయునట్లు చేయబడినది. మీరు పెద్ద వ్యూఫైండర్‌లో దృశ్యమందు లక్ష్యముంచి మీట నొక్కితే చాలును. ఇంటిలో చిత్రములు తీయుటకు 'కోడక్' ఫ్లాష్‌హోల్డర్ జత చేయండి. రు. 59/-
తోలు కేసు రు. 12/- ఫ్లాష్‌హోల్డర్ రు. 22/12



# కెమేరా రు. 29/8

ఫ్లాష్‌హోల్డర్ - - రు. 29/-
తీసుకు వెళ్లుటకు కేసు రు. 5/4




## పిక్స్-20 'బ్రౌనీ' కెమేరాలు

ఈ జన ప్రియమైన కెమేరాలతో చక్కని, స్పష్టమైన చిత్రములు తీయవచ్చును. మోడలు 'డి'లో క్లోజ్-అప్ లెన్సు లోపలే ఉంది. మోడలు 'ఇ' మరియు 'ఎఫ్'లలో క్లోజ్-అప్ లెన్సులు మరియు బయట స్నేప్‌షాట్లు తీయుటకు రంగు ఫిల్టర్లు కలవు.

మోడలు 'సి' రు.24/- మోడలు 'ఇ'* రు.34/-
మోడలు 'డి'* రు.29/- మోడలు 'ఎఫ్'* రు.36/8
*ఫ్లాష్‌హోల్డర్ రు. 29/-



ధరలలో అమ్మకపు పన్ను చేర్చబడలేదు.



కోడక్ లిమిటెడ్
(ఇంగ్లండులో స్థాపితము)
బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు




## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువ దగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు. 6 0 0




## బాలసరస్వతి పిక్టోరియల్ మీడియం డిక్షనరి

(ఇంగ్లీషు—ఇంగ్లీషు—తెలుగు)

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ ఉపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తి క్యాలికో బైండు

| | |
|---|---|
| మీడియం ధర | 9 0 0 |
| జెం డిక్షనరీ ధర | 4 8 0 |




## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దలకు ఉపయుక్తపడు గ్రంథరాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

వలయువారు: **బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.**

బ్రాంచి: నెం. 6, సుంకురామచెట్టి వీధి, మద్రాసు.

# ప్రెసిడెంట్

టాయిలెట్ వస్తువులలో అగ్రేసరము!

**ప్రెసిడెంట్ వెజిటబిల్ హెయిరాయిల్** చక్కని శిరోజములను పెంచును.

**ప్రెసిడెంట్ స్నో** లాలిత్యమును పెంపొందించును.

**ప్రెసిడెంట్ టాల్కమ్ పౌడరు** శరీరమునకు అందమైన వర్చస్సు నిచ్చును.






RATHOD TRADING CO · SOWCARPET · MADRAS · 1

# చందమామ

నంచాలకుడు : 'చక్రపాణి'

విద్య ఎంతఉన్నా దానితోబాటు వినయం కూడా ఉండాలి. వినయంలేని విద్య రాణించదు. పైపెచ్చు అది మనని ఎప్పటికైనా నవ్వులపాలుచేసి తీరుతుంది.

"ఓర్చలేనివాడు" అనే జాతక కథలో మూసిలుడు ఏమీ రాకుండానే తాను గొప్ప వైణికుడిననుకున్నాడు. తనకన్న గుత్తిలుడు గొప్పవాడని రూఢి అయినాక ఆయనవద్దకు వెళ్ళి వీణ వాయించటం నేర్చుకున్నాడు. అయితే మూసిలుడికి విద్యతోబాటు వినయం అబ్బలేదు. అందుకనే అతను తన గురువుస్థానం అపహరించ యత్నించి, గురువుతో పోటీచేసి ఓడిపోయి పరాభవం పొందాడు. అతని యత్నాలన్నీ విఫలమయాయి.

వినయంలేని కారణంచేతనే మూసిలుడు నేర్చిన విద్య అంతా వృథా అయిపోయింది.

ఫిబ్రవరి 1956

సంపుటి 18
సంచిక 2



# సింహం పెళ్లి!

వనరాజై మృగరాజై
ఘనకీర్తిని కాంచిన
పంచానన మొక మానవ
బాలను ప్రేమించెను.

ప్రేమించినదే తడవుగ
ఆ మృగాల రాయుడు,
పెళ్లి చేయుమని కోరెను.
పిల్లవాని తండ్రిని!

సింహం కోరిన కోరిక
చిక్కు తెచ్చి పెట్టగా,






ఆలోచనలో మునిగెను
ఆ బాలిక జనకుడు.

జంతువునకు పిల్లనీయ
జాలననుట ఆపద!
బలవంతుని కోపమనిన
ప్రాణాంతకమే కద!

అందుచేత అతడిట్టు
లనెనా మృగరాజుతో;
" ఒకటి రెండు షరతులు నీ
కొప్పుదలైనట్టిచో

తక్షణమే నా కూతురు
నిను వివాహమాడును;





నీకన్నా తగినవరుని
లోకంలో చూడను!"

అనగా విని సింహ మప్పు
డడిగె షరతులేమని?
తండ్రి పలికెనిటు; "జాగ్ర
తగావిను, చెబుతామరి!

నీ గోళ్లూ నీ కోరలు
పెళ్లికి ప్రతిబంధకం!
తొలగిస్తే వాటిని, సం
తోషిస్తా మందరం!"

"ఇంతేనా? ఐతే సరి,
నీయిష్టం చొప్పున



(గేయ కథ)

తీయించెయ్, నా గోళ్లూ
నా కోరలు చప్పున!"

అని సింహం పలుకగానె
ఆతడట్లే చేసెను;
తిన్నగ గోళ్లూ కోరలు
తీసి పారవేసెను!

కోరలూడి గోళ్లుపోయి
వీరుడంత పాపము!
కుక్కల గుంపులకు చిక్కి
కోలుపోయె ప్రాణము!



# అట్టమీది బొమ్మ

కుమారస్వామికీ, దేవసేనకూ వివాహం అయిన సమయాన సమస్తదేవతలూ, దిక్పాలకులూ, బ్రహ్మ, పార్వతీ పరమేశ్వరులూ వచ్చారు. తరువాత పార్వతీ పరమేశ్వరులు, వెయ్యి సింహాలు పూన్చిన రథంమీద కుమారస్వామినీ, దేవసేననూ కూర్చోబెట్టుకుని భద్రవటానికి బయలుదేరారు. రథానికి ముందుగా కుబేరుడు తన పుష్పక విమానం ఎక్కి కదిలాడు. రథానికి వెనకగా ఇంద్రుడు ఐరావతం ఎక్కి వచ్చాడు. కుమారస్వామి రథానికి ఒక పక్క అష్టవసువులూ, ఏకాదశరుద్రులూ, మరొక పక్క దిక్పాలకులూ, బ్రహ్మర్షులూ ఉన్నారు.

వీరందరూ వెంట రాగా కుమారస్వామి మహావైభవంగా భద్రవటం చేరి, అందరి ఆశీస్సులూ పొంది, అక్కడ నివాసం ఏర్పరచుకున్నాడు.

కొంతకాలానికి మహిషాసురుడనే రాక్షసుడు రాక్షససేనలన్నిటినీ సమకూర్చుకుని దేవతలపైకి దండెత్తి వచ్చాడు. రాక్షసగణాలు ఆశ్రమాలు ధ్వంసం చేశాయి, యజ్ఞాలు భగ్నంచేశాయి, నిరాయుధులైన ప్రజలపై బడి, భయపెట్టి, హింసించి, పీడించాయి. వీరినందరినీ రక్షించటానికి వచ్చిన దేవసేనలకూ, రాక్షసగణాలకూ భయంకరమైన యుద్ధం సాగింది. ఈ యుద్ధంలో దేవతలు, మహిషాసురుడి ధాటికి అగలేక, చెల్లాచెదరై పారిపోయారు.

బ్రహ్మవల్ల అనేక వరాలు పొందిన మహిషాసురుడు విజయగర్వంతో పరమేశ్వరుడున్న చోటికి వెళ్ళి ఆయన రథాన్ని పట్టుకున్నాడు. మహిషాసురుడికి పరమేశ్వరుడుకూడా ఓడిపోయాడని సంతోషించి రాక్షసులు విజయనాదాలు చేశారు.

అప్పుడు పరమేశ్వరుడు కుమారస్వామిని తలుచుకున్నాడు. వెంటనే కుమారస్వామి యుద్ధసన్నద్ధుడై, శక్తిని చేత ధరించి, కోపావేశంలో కళ్ళ నిప్పులు రాలగా మహిషాసురుడిపైకి వచ్చి ఆ దుర్మార్గుడిపై శక్తిని విసిరాడు. దాని దెబ్బకు మహిషాసురుడి తల పగిలిపోయి వాడు కొండ విరిగిపడ్డట్టు పడిపోయి చనిపోయాడు. మహిషాసురుడికి అండగావున్న మహాబలులైన రాక్షసులు కుమారస్వామి పైకి వచ్చారు. కాని కుమారస్వామి వారినందరినీ ఒక్క మధ్యాహ్నంలో చిత్రవధచేసి యమపురికి పంపేశాడు. యుద్ధం ముగిసింది. దేవతలు కుమారస్వామిపై పుష్పవర్షం కురిపించారు.




# ఓర్చలేనివాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు గుత్తిలుడు అనే వైణికుడుగా జన్మించాడు. పదహారు సంవత్సరాల వయసుకే గుత్తిలుడితో సమంగా వీణ వాయించేవాడు జంబూద్వీపంలో లేడన్న ఖ్యాతి దశదిశలా వ్యాపించింది. అందుచేత కాశీరాజు అతన్ని తన ఆస్థాన వైణిక విద్వాంసుడుగా పెట్టుకున్నాడు.

ఇది జరిగిన అనేక సంవత్సరాలకు కాశీ నుండి కొందరు వర్తకులు బయలుదేరి వ్యాపారం నిమిత్తం ఉజ్జయినీ నగరం వెళ్ళారు. గుత్తిలుడి ధర్మమా అంటూ కాశీరాజ్యంలో అబాలగోపాలానికీ వీణా వాద్యంమీద అత్యంత ప్రీతి. అందుచేత ఈ కాశీవర్తకులకు వీణావాద్యంమీద మనసు పోయింది. వారు అక్కడి వర్తకులతో, "మాకు వీణావాద్యం వినాలని ఉన్నది. ఈ ఉజ్జయినిలో ఉండే వైణికులలోకెల్లా గొప్ప వాణ్ణి పిలిపించి వాద్యగోష్ఠి ఏర్పాటు చేయండి. ఎంత ఖర్చయినా సరే మేము ఉమ్మడిగా భరిస్తాం!" అన్నారు.

ఉజ్జయినిలో గొప్ప వైణికుడు మూసిల్ అనేవాడు. అందుచేత కాశీవర్తకుల వినోదం కొరకు అతని పాటకచేరీ ఏర్పాటుచేశారు. మూసిల్ వీణతోసహా వర్తకుల బసకు వచ్చాడు. వీణతీగెలు శ్రుతిచేసి వాయించ సాగాడు. ఎంతసేపు వాయించినా కాశీవర్తకుల ముఖాలలో ఆనందం ఏమీ కనబడ లేదు. ఇలా కాదని మధ్యమం శ్రుతిచేసి కొన్ని పాటలు వాయించాడు. అప్పటికీ వర్తకులలో చైతన్యం కనిపించలేదు.

చివరకు మూసిల్, "అయ్యా, నేనింత సేపుగా వీణ వాయిస్తున్నాను గాని తమకు కొంచెమైనా ఆనందం కలిగినట్టు కనబడదు. నా వీణావాద్యం తమకు నచ్చలేదా?" అని అడిగాడు.



కాశీవర్తకులు తెల్లబోయి ఒకరినొకరు చూసుకున్నారు. వారిలో ఒకడు, "నువ్వింటాకనుంచీ వీణ వాయిస్తున్నావా? శ్రుతులు సరిచూస్తున్నావనుకుంటున్నాం!" అన్నాడు.

"వీణ చెడిపోయింది కాబోలు, సరిగా పలకక నిన్ను తిప్పలు పెడుతున్నదనుకుంటున్నాం! క్షమించాలి, అంతకన్న మరేం లేదు!" అన్నాడు ఇంకొకడు.

మూసిల్ ముఖం ముడుచుకుని, "అయితే మీరు నాకన్న చాలా గొప్ప వైణికుడి వాద్యం విని ఉంటారు. అందుచేతనే నా వాద్యం మీకు నచ్చలేదు. ఆ వాద్యగాడెవరో సెలవియ్యండి," అన్నాడు.



"అయితే నువు మా కాశీనగర ఆస్థాన వైణికుడైన గుత్తిలుడి వాద్యం గురించి విననేలేదా?" అని వర్తకులు అడిగారు.

"ఆయన గొప్ప వాద్యగాడా?" అని అడిగాడు మూసిల్.

"ఆయన వీణావాద్యంతో పోలిస్తే నీది వాద్యమేకాదు." అన్నారు వర్తకులు.

"అయితే ఆయనతో సమంగా వాయించా ననిపించుకునేదాకా నేను విశ్రాంతి పుచ్చుకోను. నాకు మీరేమీ డబ్బివ్వనవసరం లేదు," అంటూ మూసిల్ వెళ్లిపోయాడు. అతను ఆరోజే ప్రయాణమై కాశీనగరంచేరి బోధిసత్త్వుడి ఇంటికి వెళ్ళాడు. బోధిసత్త్వుడు మూసిల్‌ను చూసి, "ఎవరు, నాయనా?" అని అడిగాడు.

"అయ్యా, మాది ఉజ్జయిని. నన్ను మూసిలుడంటారు. తమవద్ద వీణ నేర్చుకోవాలని వచ్చాను. తమ అనుగ్రహం ఉంటే తమతో సమానుణ్ణి అనిపించుకోవాలని నా ఉద్దేశం!" అన్నాడు మూసిల్. బోధిసత్త్వుడు అతనికి వీణావాద్యం నేర్పటానికి అంగీకరించాడు.

మూసిల్ రోజూ ఇంటివద్ద వీణ అభ్యసిస్తూ రాజసభకు బోధిసత్త్వుడివెంట వెళ్ళుతూండేవాడు.







అనేక సంవత్సరాలు గడిచాయి. ఒక నాడు బోధిసత్వుడు తన శిష్యుడితో, "నీ విద్య పూర్తి అయిపోయింది. నాకు తెలిసిన దంతా నీకు నేర్పేశాను. ఇక నువు మీదేశం వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

కాని మూసిల్‌కు ఉజ్జయినికి తిరిగి పోవాలని లేదు. అక్కడ తన విద్య రాణించదు. తనకు వీణ వాయించటం ఏమీ రానప్పుడే ఉజ్జయినీవారు తనకు బ్రహ్మ రథం పట్టారు. ఎలాగైనా కాశీ ఆస్థాన విద్వాంసుడైతేనే కీర్తీ, ప్రతిష్ఠా! ఇప్పుడు తనకు బోధిసత్వుడితో సమానమైన విద్వత్తున్నది. బోధిసత్వుడు వృద్ధుడైపోతున్నాడు కూడానూ! అందుచేత కాశీరాజు ఆస్థానం లోనే ఉద్యోగం సంపాదించాలి.

ఇలా ఆలోచించి మూసిల్, బోధిసత్వుడితో, "నాకు ఉజ్జయిని వెళ్ళాలని లేదు. మీ పాండిత్యమంతా నాకుకూడా వచ్చిందం టున్నారు గనక, మీతోబాటు నాకుకూడా ఆస్థానంలో ఉద్యోగం అయేలాగు చూడండి!" అన్నాడు.

మరనాడు బోధిసత్వుడు ఈ విషయం రాజుతో చెప్పాడు.

"అతను నీవద్ద చాలాకాలంగా శిష్యుడుగా ఉన్నాడు గనక ఆస్థాన విద్వాంసుడుగా వేసుకుందాం. నీ కిచ్చే జీతంలో సగం ఇస్తాను. అతనికి సమ్మతమైతే పదవి స్వీకరించవచ్చు," అన్నాడు రాజు.

బోధిసత్వుడీమాట చెప్పగానే మూసిల్ సంతోషించటానికి బదులు లోలోపల కుళ్ళాడు. తన తక్కువేమిటి? బోధిసత్వుడి ఎక్కువేమిటి? ఆయన జీతంలో తనకు సగం ఇవ్వటమేం?

మూసిల్, రాజువద్దకు వెళ్ళి, "మహా ప్రభూ, నన్ను సగం జీతంమీద ఆస్థాన విద్వాంసుడుగా నియమిస్తామన్నారుట! నా తక్కువేమిటి? మా గురువుగారి కెంత వచ్చునో, నాకూ అంత వచ్చు. కావలిస్తే

మా గురువుగారినే అడగండి. ఆయన కిచ్చి నంత జీతమూ తమరు నాక్కూడా దయ చేయించాలి!" అన్నాడు.

రాజుకు కోపం వచ్చింది. "నువు గుత్తిలుడి శిష్యుడివని నే నెరుగుదునుగాని, ఆయనతో సమానమైన వైణికుడివని నే నెరగను. ప్రత్యక్షంగా చూస్తేతప్ప నమ్మను కూడాను," అన్నాడాయన.

"కావలిస్తే తమరు నన్ను పరీక్షచేసి చూడండి," అన్నాడు మూసిల్.

"సరే, వీలుచూసుకుని మీ ఇద్దరికీ వాద్యపోటీ ఏర్పాటుచేస్తాను. నీ వాద్యం మీ గురువు వాద్యంతో సమంగా ఉంటే నీకుకూడా ఆయనతో సమంగా జీతం ఇస్తాను. లేనిపక్షంలో నిన్ను ఆస్థానంలోకి రానిచ్చేదేలేదు. సమ్మతమేనా?" అని అడిగాడు రాజు. మూసిల్ అంగీకరించాడు.

గురుశిష్యులిద్దరికీ పోటీ ఏర్పాటయింది. ఒకరిని మించి ఒకరు వాయించటానికి ప్రయత్నిస్తున్నారు. మధ్యలో బోధిసత్వుడి వీణతంత్రి ఒకటి తెగింది. కాని ఆయన మిగిలిన తీగలమీదనే వాయిస్తున్నాడు. ఇది చూసి మూసిల్ తన వీణతంత్రి ఒకటి బుద్ధిపూర్వకంగా తెంపేశాడు. మరికాస్సేపటికి బోధిసత్వుడి వీణ తంత్రులలో మరొకటి తెగింది. మూసిల్ కూడా మరొక తంత్రి తెంపేశాడు. కొద్దిసేపట్లోనే బోధిసత్వుడి వీణతంత్రులన్నీ తెగిపోయాయి; మూసిల్ తన వీణతంత్రులన్నీ తెంపేసుకున్నాడు. అయితే బోధిసత్వుడు తెగిపోయిన తంత్రులతోనే స్వరాలు పలికించసాగాడు. కాని మూసిల్ ఆ పని చెయ్యలేక బిక్క మొహం వేశాడు.

సభవారు బోధిసత్వుడి ప్రతిభకు హర్షించి మూసిల్‌ను గేలిచేశారు.

మూసిల్ ఆ అవమానాన్ని భరించలేక సభలోనుంచి బయటికి వెళ్ళి, ఆ రోజే ఉజ్జయినీ నగరానికి ప్రయాణమైయ్యాడు.






## 8

[శత్రువులమీదకు, నరవాహనుడూ, సమరసేనుడూ దాడి బయలుదేరారుగదా? పట్టణం వెలుపలి మైదానంలో, ఘోరయుద్ధం జరిగింది. విజయం సమరసేనుడిదే అయినా, అతడు తీవ్రంగా గాయపడిపోయాడు. నరవాహనుడు రాజుగా ప్రకటించుకున్నాడు. శివదత్తుడు అనుచరులతో, రహస్యద్వారంనుంచి బయటికి పారిపోదలిచాడు. తరవాత—]

"ఆ రహస్య ద్వారంనుంచి ముందెన్నడూ మీరు ప్రయాణించలేదా?" అని ప్రశ్నించాడు మందరదేవుడు ఆశ్చర్యపడుతూ.

శివదత్తుడు నిరుత్సాహంగా తలపంకించి, "అలాంటి అవసరం అంతకు ముందెన్నడూ నాకు కలగలేదు. కాని, తీరా రహస్యద్వారం తెరిచింతరవాత ఆ కారు చీకటిలో దివిటీల సహాయం లేందే నడవటం సాధ్యమయే పని కాదని తెలుసుకున్నాను. నా తొందరలో నేను వాటి మాట మరిచిపోయినా, నా అనుచరులు తగు జాగ్రత్తలోనే వున్నారు. వాళ్లు తక్షణం కొన్ని దివిటీలు వెలిగించి, సొరంగంలోకి దిగారు. నేనూ దిగాను. అంతలో నా వెనుక వున్న ఒకడు "శివసేనానీ, శత్రువులు కోట ద్వారం బద్దలుకొట్టి లోపల ప్రవేశించారు. వినండి, ఆ కోలాహలం!" అంటూ కేకవేశాడు.

"సరే, ద్వారం మూసివెయ్యి. నరవాహనుడు వచ్చేవరకూ, వాళ్ళకు యీ రహస్యద్వారం సంగతి తెలీదు. ఈ లోపల మనం సురక్షితంగా బయటపడవచ్చు, భయంలేదు!" అన్నాను.



ఆ చీకటి సొరంగంలో కొంత దూరం నడిచేసరికి, మా దారికి అడ్డంగా వేలాడుతున్న ఒక ఇనపగొలుసు కనిపించింది. తలయెత్తి చూచాను. అక్కడ సొరంగం పైభాగాన ఒక పెద్ద తలుపు అమర్చబడివుంది. గొలుసు కొంచెంగా లాగిచూసేసరికి, బుస్సుమంటూ నీరు లోపలికి ఉరికింది. ఆ క్షణంలో గొలుసుతో బంధించబడిన ఆ తలుపు అక్కడ అమర్చబడిన కారణం ఏమిటో నాకు అర్థమైంది.

ఒకవేళ శత్రువులు రహస్య ద్వారం ఎక్కడ వున్నదీ గ్రహించి వెంటబడితే, ఆ తలుపును గొలుసు సహాయంతో కిందకు దించటంద్వారా, వెనుక భాగాన వున్న మొత్తం సొరంగాన్ని జలమయం చేయవచ్చు! ఇది చక్కని ఉపాయంగా తోచింది. దీనిని అమలు చేయవలసిన అవసరం ఏమైనా వున్నదా అన్న అనుమానంతో రహస్య ద్వారంకేసి చూశాను. నా అనుమానం ధృవపడింది. అక్కడ కొన్ని దివిటీలు చీకట్లో కదుల్లాడటం నా కంట పడింది. అంటే, శత్రువులు, నా ఆచూకీ తెలుసుకున్నారన్న మాట! ఇక వెనుక ముందులు ఆలోచించేందుకు కాలంలేదు. నా బలంకొద్దీకీ, ఆ తలుపుకు వున్న గొలుసు లాగాను. దభీమంటూ తలుపు సొరంగానికి అడ్డుగా పడటం; ఆ వెనక గర్జిస్తూ జలపాతం కిందకు దూకటం వినబడింది.

ఇక ఇప్పుడు చేయవలసింది, సాధ్యమైనంత తొందరగా సొరంగంనుంచి బయటబడటం. ఆలశ్యం జరిగితే, నరవాహనుడు, అడవిలో వున్న దాని రెండవ కొసను తన సైనికులతో చుట్టుముట్టవచ్చు. అలా జరిగితే, నా పనీ, నా అనుచరుల పనీ, బోనులో చిక్కిన ఎలుకల చందమవుతుంది.

కొద్దిసేపట్లో మేం సొరంగం అవలికొసను చేరాం. అక్కడ సొరంగం అడుగు భాగాన్నుంచికొన్ని మెట్లు అంచెలక్రమంలో



పైకి కట్టబడినై. అలికిడి కాకుండా ఆ మెట్లెక్కి, అక్కడ వున్న ద్వారానికి చెవి అనించి, అవలనుంచి ఏమైనా అలికిడి వినబడుతుందేమో అని వినసాగాను.

కొద్దిసేపటివరకూ అంతా నిశ్శబ్దంగా వుంది. ఇక మాను బోదెలో అమర్చబడి వున్న రహస్య ద్వారం తెరిచి బయట పడటం క్షేమమనుకున్నాను. నేను ద్వారం మీద చేయివేసి, తుప్పు పట్టివున్న గడియలను కదిలించేటంతలో, అవతలినుంచి గుర్రం సకిలించిన ధ్వనీ, మనుషుల మాటలూ వినిపించినై.



"అంతా భద్రంగానే వుంది. మాను బోదెలో ఉన్న రహస్యద్వారం మూసే వుంది," అన్నా డొకడు.

"ఓహో, అలాగా! అయితే, ఆ ద్రోహులందరూ, సొరంగంలో నీటబడి, ఎలుకల్లా చచ్చివుంటారు!" అన్నాడు మరొకడు.

మళ్ళీ కాసేపు మాటలేమీ వినబడలేదు. నేనేమి చేయటమా అని ఆలోచించేటంతలో, కఠినమైన అధికార స్వరంతో ఒక గొంతు కంచులా మోగింది.

"ఇంత దూరంలో నించుని కబుర్లాడితే లాభంలేదు. ఆ ద్రోహులు చచ్చారో లేక మనకన్న ముందుగా ద్వారంనుంచి బయట పడి, అడవిలోకి పారిపోయారో మనకు తెలీదు. పైగా చచ్చినా, బతికినా—ఆ శివదత్తుడి తల తేగలిగితే, ఒక సామంత రాజ్యం ఇస్తానని రాజు నరవాహనుడు నాకు వాగ్దానం చేశాడు."

"అయితే, ఇప్పుడేం చేయమని మీ ఆజ్ఞ!" అని ఒకేసారి రెండు గొంతులు భయపడుతూ ప్రశ్నించినై.

"వెళ్ళి, ఆ చెట్టు బోదెలో వున్న రహస్య ద్వారం తెరిచి చూడండి. ఆ వెనక వున్న సొరంగం పూర్తిగా నీటిమయమయివుంటే ఇప్పట్లో అతడి శవంకూడా మనకు దొరకదు. అలా కానప్పుడు..."



అతడు మాట ముగించక ముందే, ద్వారం పక్కనుంచి భయంకరమైన సింహ గర్జన వినిపించింది. ఆ వెంటనే మరి కొన్ని చిన్నా పెద్ద గర్జనలు మార్మోగినై. మాట్లాడు తున్న నరవాహనుడి సైనికులు వెనుకకు తగ్గుతున్న సూచనగా గుర్రాల సకిలింపులూ, వాళ్ళ హెచ్చరికలూ వినిపించినై.

"ఆ మాను బోదెపక్కన ఏవో సింహాలు, వున్నట్టుంది. ప్రమాదం, వెనక్కు తగ్గండి!" అంటూ ఒకడు అరిచాడు. ఆవెంటనే వాళ్ల నాయకుడి కంఠనాదం మారుపలికింది.

"ఒక్క సింహాలేకాదు, ఏనుగులూ, ఎలుగుబంట్లూ వున్నా పని పూర్తికానిదే వెనక్కు తిరిగేందుకు వీలులేదు. పిరికి పందలు నాకత్తికి బలికాగలరు, జాగ్రత్త!"

ఆతరవాత సింహాలు వాళ్లమీదికి లంఘించినవన్న సూచనగా, భయంకరమైన గర్జనలూ, గుర్రాలతొక్కిసలాటా, సైనికుల కేకలూ వినిపించినై. నేను నా సహచరులతో సొరంగంనుంచి బయట పడాలంటే, యింతకన్న మంచి తరుణం మరి రాదనిపించింది.

నరవాహనుడి సైనికులు సింహాలను హతమార్చిం తరవాత, నన్నూ నా అనుచరుల్నీ హతమార్చేందుకు తప్పక సొరంగ ద్వారాలదగ్గరకు రాగలరు.



నా అనుచరులతో, వున్న పరిస్థితీ, అంత ఎక్కువ ప్రమాదంలేకుండా, కొందరమైనా బతికి బయటపడాలంటే, చేయవలసినపనీ చెప్పాను. నరవాహనుడి సైనికులు, సింహాలతో గొడపపడేసమయమే, మనకూ వాళ్లను ఎదుర్కొనేందుగ్గాని, లేక అడవిమార్గాన పారిపోయేందుగ్గాని, మంచి అదనని అందరూ అంగీకరించారు.

ఆ సమయంలో నాయకుడుగా నామీద వున్న గొప్ప బాధ్యత నన్ను చాలా కలవరపరిచింది. ఇప్పుడు నేను, నా అనుచరులకు యిచ్చే సూచనలమీదా, ఆజ్ఞలమీదా— మా అందరి భవిష్యత్తూ ఆధారపడి వుంది. నాతోపాటు, నా అనుచరులకూ్కడా మరణమో లేక సురక్షితప్రదేశానికి పారిపోగల అవకాశమో—ఏదో ఒకటి యిక కొద్ది నిమిషాల్లో తేలిపోతుంది.

నేను, యిక ఏమాత్రం ఆలశ్యంలేకుండా రహస్యద్వారం తెరిచాను. తుప్పుపట్టివున్న ఆద్వారాలు కిర్రుమని ధ్వనిచేస్తూ తెరుచుకున్నాయి. బయటికి చూతునుగదా— అక్కడ జరుగుతున్న గందరగోళం చాలా భీభత్సంగా కనబడింది.

సింహాలు, ఒకటికాదు రెండుకాదు— దాదాపు చిన్నాపెద్దవి ఐదారు కలిసి సైనికులు ఎక్కివున్న గుర్రాలమీద కలియ





బడినై. సైనికులు దాదాపు ఓ యిరవైమంది వరకూ వుంటారు. వాళ్లు చెట్లమధ్య చిక్కుకుపోయి, భయంకరంగా గర్జించి మీదకు దూకుతున్న సింహాల పంజాదెబ్బల నుంచి పారిపోలేకా, తమచేతనున్న యీటెలతో వాటిని చంపలేకా—నానా గగ్గోలూ పడిపోతున్నారు. అల్లంతదూరాన గుర్రం మీద కూచునివున్న వాళ్ళ నాయకుడు, చేతి కత్తిని గాలిలో గిరగిరా తిప్పుతు-,

"భయపడకండి, హతమార్చండి, చంపండి!" అంటూ అరుస్తున్నాడు. కాని, అతడుమాత్రం ఆ సింహాల నేటినీ ఎదుర్కొవటంలేదు సరిగదా, అంత ప్రమాదం తటస్తపడితే పారిపోయేందుకు సిద్ధంగా గుర్రాన్ని వెనక్కు నడుపుతున్నాడు.

నేను, నా అనుచరులతో సొరంగ ద్వారంనుంచి బయటపడటం, నరవాహనుడి సైనికులుగాని, వాళ్ళ నాయకుడు గాని గమనించలేదు. వాళ్ళ దృష్టి ప్రాణ రక్షణ చేసుకోవటంమీదేవుంది. నేను, నా అనుచరులతో పొదలమాటున దాగుతూ ఒక్కొక్క అడుగే ముందుకుపోయి, కొద్ది సేపట్లో నరవాహనుడి సైనికుల వెనక భాగాన చేరాను. వాళ్ళను ఒకవైపునుంచి సింహాలు చీకాకుపరుస్తున్నవి; నేను రెండో వైపునుంచి హఠాత్తుగా మీదపడి వాళ్ళను సర్వనాశనం చేయదలిచాను.

నా అభిప్రాయం విన్న, నా అనుచరులందరూ నాతో ఏకీభవించారు. కాని, ఒక ళ్లిద్దరకు, నరవాహనుడి సైనికులమీదపడిన సింహాలు, తమనూ ఎదుర్కొంటవని భయంకలిగింది. చావుకు సిద్ధమైనతరవాత, అది శత్రువుచేతిలో సిద్ధించినా, సింహంవల్ల తటస్థపడినా—అట్టే భేదం వుండదని వాళ్లకు నచ్చచెప్పాను.

పొదలమాటున పొంచివున్న నేను, ఒక్కమారుగా 'సమరసేనుడికీ జై!' అంటూ అరిచి, నరవాహనుడి సైనికులను వెనుక



నుంచి డీకొన్నాను. ప్రళయ భయంకరంగా అరుస్తూ, నా అనుచరులు ఉగ్రనరసిం హుల్లా వాళ్ళమీద పడ్డారు.

మొట్టమొదటి నా కత్తిదెబ్బకు, వాళ్ళ నాయకుడి తల బొండాంలా గాలిలోకి లేచి అంత దూరానవున్న పొదల్లో పడిపోయింది. నా అనుచరులు తమ కత్తులతో శత్రు సైని కులను దొరికినచోట దొరికినట్టు నరక సాగారు. ఈ పోరాటంమధ్య సింహాలగొడవ ఎవరికీ పట్టలేదు. పైగా అసరికే రెండు మూడు సింహాలు, నరవాహనుడి సైనికుల యీటెపోటులుతిని వెల్లకిలాపడి గిలగిల కొట్టుకుంటున్నయి. మిగిలినవి మా భయం కర నాదాలతో హడలెత్తి పారిపోసాగినై.

నాలుగైదు నిమిషాలు గడిచేసరికి, నర వాహనుడి సైనికులలో చాలామంది మా కత్తులకు ఎర అయిపోయారు. తమను యింత హఠాత్తుగా ఎదుర్కొన్నవారెవరో వాళ్ళు గ్రహించేలోపలే, వాళ్ళల్లో చాలా మందిని తుదముట్టించాము. కాని, మిగిలిన పదిపన్నెండుమంది అంతలోనే తెప్ప రిల్లారు. వాళ్ళల్లో ఒకడు కంఠనాళాలు బద్దలయ్యేలా అరుస్తూ:

"శివదత్తుడు, ద్రోహి, నరకండి! అతడి తల ఒక సంస్థానాన్ని తెచ్చి పెడుతుంది!" అంటూ మామీదికి బెబ్బులిలా ఉరికాడు.

ఆ సైనికుడు ప్రదర్శించిన సాహసం, అతడి అనుచరుల్లోకూడా ధైర్యోత్సాహాలను కలిగించినట్టుంది. వాళ్ళందరూ ఒక్కుమ్మ డిగా, నా అనుచరుల మీదకు దూకారు. ఆ సరికే విజయం సాధించామన్న దిలా సాలో వున్న, నా అనుచరుల్లో కొందరు, శత్రువుల తాకిడికి నేలకొరిగారు. నేను, నా కత్తితో శత్రు ముఖ్యుడి గుర్రాన్ని బలంగా పొడిచాను. ఆ దెబ్బతో అది వెనక రెండు కాళ్ళమీదా నిలబడేసరికి, రౌతు కింద పడి పోయాడు. గుర్రం అరుస్తూ అతడి మీదికి ఒరిగిపోయింది. (ఇంకావుంది)



# అనంతకోటి లింగాలు!

మహాశివరాత్రి పర్వదినాన తెల్లవారకముందే ఒక బ్రాహ్మడు సముద్ర స్నానానికి వెళ్ళాడు. అప్పటికింకా ఆటే జనం సముద్రతీరాన చేరలేదు. బ్రాహ్మడి దగ్గిర ఒక రాగి చెంబున్నది. దాన్ని ఒడ్డున విడిచి తాను సముద్రంలో దిగితే ఎవరైనా చేతివాటు వెయ్యగలరని భయపడి బ్రాహ్మడు తన రాగిచెంబును ఇసుకలో పూడ్చి, గుర్తుగా ఉంటుందని అక్కడ ఇసుకతో ఒక లింగాకారం తయారుచేసి తరవాత స్నానానికి వెళ్ళాడు.

ఆ సమయానికి స్నానంకోసం అక్కడికి చేరినవాళ్ళు, శివరాత్రినాడు ఇసుక లింగం తయారుచేసి స్నానంచేస్తే పుణ్యంకాబోలని తామున్నూ ఇసుక లింగాలు చేసి సముద్రంలో దిగారు.

వారిని చూసి వీరూ, వీరిని చూసి ఇంకోరూ, ఈ విధంగా సముద్ర స్నానానికి వచ్చినవారంతా ఒడ్డున వేనకు వేల సంఖ్యలో ఇసుక లింగాలు తయారుచేసి సముద్రంలో దిగటంవల్ల, బ్రాహ్మడు తిరిగివచ్చి తాను చేసిన లింగం ఏదో పోల్చుకోలేకపోయాడు. రాగిచెంబు కాస్తా పోనేపోయింది!



# ఎవరి కొడుకు?



విక్రమార్కుడు పంతంతో వెనక్కు వెళ్ళి, చెట్టుమీదినుంచి శవాన్ని దించి, తన భుజం మీద వేసుకుని, మౌనంగా స్మశానం కేసి మరొకసారి నడవసాగాడు. అప్పుడు శవంలో వున్న బేతాళుడు, "రాజా, నా మూలంగా నీకు చాలా ప్రయాస కలుగుతున్నది. అందుచేత యిప్పుడు నీకొక వింత కథ చెబుతాను విను," అంటూ విక్రమార్కుడికి ఈ కింది కథ చెప్పాడు:

తామ్రలిప్తి అనే నగరంలో ఒక వైశ్యుడుండేవాడు. ఆయనకు ధనవతి అని ఒక కుమార్తె ఉండేది. ఆమెకు యుక్త వయస్సు వచ్చి వివాహం చేద్దామనుకుంటున్న సమయంలో తండ్రికి కాస్తా జబ్బు చేసి చనిపోయాడు.

చనిపోయే నాటికి వైశ్యుడికి ఆస్తి ఆటే లేకపోగా బోలెడన్ని అప్పులున్నాయి. అప్పులవాళ్లు తన నగలు కాజేస్తారేమో,

బేతాళ కథలు

కూతురికి పెట్టుకోవటానికైనా ఉండదని భయపడి వైశ్యుడి భార్య, తన నగలన్నీ మూటగట్టుకుని, ధనవతిని వెంటబెట్టుకుని అర్ధరాత్రి అంధకారంలో మరొక దేశానికి ప్రయాణ మయింది.

వారు నగరం దాటి వధ్యభూమి దాటి పోతూండగా, ఆ సాయంకాలమే కొరత వేయబడిన ఒక దొంగ శరీరానికి వైశ్యుడి భార్య భుజం తగిలింది. ఆ బాధతో దొంగ, "అయ్యయ్యో, అసలే చచ్చిపోతున్న నన్ను మరింత హింసిస్తున్నా రెవరు?" అని ఆక్రోశించాడు.

"చీకటిలో కనిపించలేదు, నాయనా!" అన్నది వైశ్యస్త్రీ.

"మీరెవరు? ఈవేళప్పుడు యెక్కడికి పోతున్నారు?" అన్నాడు దొంగ.

"నేనొక వైశ్యస్త్రీని. ఇది నా కూతురు. నా భర్త పోయాడు. ఈ నగరంలో మాకిప్పుడు దిక్కెవరూ లేరు. మరెక్కడి కైనా పోయి నా కుమార్తెకు పెళ్ళి చేసుకుంటాను!" అన్నది వైశ్యస్త్రీ.

దొంగ కొంచెం ఆలోచించి, "అమ్మా, నే నెట్లాగూ చచ్చిపోతున్నాను. అయితే నాకు పెళ్ళిలేదు, పిల్లలూ లేరు. కొడుకులు లేని నాకు పుణ్యలోకాలుండవు. అందు




చేత నీ కుమార్తెను నాకు ధారపొయ్యి. ఆ తరవాత ఆమెకు పుట్టే పిల్లలు నాకు క్షేత్రజ సంతానం అవుతారు. వారిద్వారా నాకు పుణ్యలోకాలు కలుగుతాయి. నువు నాకీ ఉపకారం చేస్తివా, నేను దొంగతనం చేసిన సొమ్మంతా ఎక్కడ దాచివుంచానో చెబుతాను. అది తీసుకుని వెళ్ళి నువ్వూ, నీ కుమార్తే మీ యిష్టంవచ్చిన చోట సుఖంగా ఉండవచ్చు! నీ కుమార్తె పెళ్ళి చేసుకోనూవచ్చు!" అన్నాడు.

ద్రవ్యాశచేత వైశ్యస్త్రీ తన కుమార్తె ధనవతిని, చావటానికి సిద్ధంగావున్న దొంగకు ధారపోయ నిశ్చయించుకున్నది.



"ఆ దూరాన కనబడే మర్రిచెట్టు మొదటనే నేను నా బంగారమంతా పాతి పెట్టాను. నేను చచ్చిపోయేలోగా ఆ ధనం తవ్వి తెచ్చుకో. నేను పోయాక నన్ను తీసుకుపోయి దహనంచేసి, నా అస్థికలు తీసుకుపోయి నీటిలో కలుపు. ఈ సమీపంలోనే వక్రోలకమనే నగరం ఉంది. ఆ దేశపు రాజు చాలా మంచివాడు. ఆయన ఏలుబడిలో ప్రజలు చాలా సుఖంగా వుంటున్నారు. మీరక్కడికి వెళ్ళండి," అని దొంగ సలహా ఇచ్చాడు.

వైశ్యస్త్రీ అతను చెప్పిన ప్రకారం మర్రి చెట్టుదగ్గిర తవ్వి దొంగ దాచిన బంగారమంతా తీసుకుని తన కూతురితోసహా వక్రోలకానికి వెళ్ళింది. అక్కడినుండి మనుషులను పంపి దొంగ శవాన్ని తెప్పించి అతనికి దహనక్రియలు చేసి, అతని అస్థికలను నీటిలో వేయించింది.

వక్రోలకంలో ఒక బ్రాహ్మణ యువకుడున్నాడు. వాడి పేరు విష్ణుస్వామి. వాడు జూదరి, ఎందుకూ పనికిరానివాడు. అయితే వాడు చూపులకు అందగాడు. వైశ్యకులానికి చెందిన ఇద్దరు స్త్రీలు ఎక్కడి నుంచో వచ్చి ఈ నగరంలో ఉంటున్నారనీ, వారివద్ద చాలా ధనం వున్నదనీ విష్ణుస్వామి పసికట్టాడు. వాడు వారి పరిచయం చేసుకుని, తనకు ధనవతిని పెళ్ళాడాలని వున్నట్టు ఆమె తల్లితో అన్నాడు. విష్ణుస్వామి అందం చూసి భ్రమపడి ధనవతి పెళ్ళికి సంతోషంగా ఒప్పుకున్నది.

పెళ్ళి అయినదిమొదలు విష్ణుస్వామి భార్యను డబ్బుకోసం వేధించసాగాడు. ధనవతి అయితే, అతను అడిగినంత డబ్బూ ఇచ్చేదేమోగాని, తల్లి పడనివ్వలేదు. కాలక్రమాన ధనవతికి, విష్ణుస్వామివల్ల ఒక కుమారుడు కలిగాడు.

"కొడుకునుకూడా కన్నావు. నీకు బాధ్యత కొంచెమైనా తెలియకుండా వున్నది. బయ

టికి పోయి డబ్బు సంపాదించుకురా!" అని విష్ణుస్వామిని అత్తగారు పోరసాగింది. ఈ పోరు పడలేక విష్ణుస్వామి తన భార్యనూ, కుమారుణ్ణీ వదిలేసి ఎవరితోనూ చెప్ప కుండా దేశాలమీద లేచిపోయాడు.

తరవాత కొద్దికాలానికే వైశ్యస్త్రీ మర ణించింది. ధనవతికి జీవితంమీద విరక్తి పుట్టింది. ఇంతకాలమూ ఆమె తల్లిచాటున ఉంటూ వచ్చింది. కొడుకును పెంచుతూ జీవయాత్ర గడపటం ఆమెకు సాధ్యం కాలేదు. ఆమె తన పసిపిల్లవాణ్ణి వీధిలో మంచంమీద పడుకోబెట్టి, వాడి పక్కనే తనదగ్గిర వున్న ధనమంతా మూటగట్టిపెట్టి, ఎటో వెళ్ళి పోయింది. తన కుమారుడు బీదవారికి దొరికినా ఆ డబ్బుతో వాళ్లు వాణ్ణి ఏలోటూ లేకుండా ఇబ్బంది పడకుండా పెంచుతారని ఆమె ఉద్దేశం.

అయితే ఆ కుర్రవాడు ఆ దేశపు రాజుకే దొరికాడు. ఆయన తెల్లవారుజామున గుర్రంమీద నగరప్రదక్షిణం చేస్తుండగా దారికి అడ్డంగా మంచమూ, మంచంమీద పిల్లవాడూ, పిల్లవాడి పక్కనే ధనపు మూటా కనిపించాయి. పాపం, ఆ రాజుకు ఏ సంతానమూ లేదు; ఎన్ని నోములు నోచినా ఆ లోటు తీరలేదు. భగవంతుడు




తనకు ఈ రూపంగా పుత్రదానం చేశాడను కున్నాడు రాజు. పిల్లవాడు చూడటానికి చాలా అందంగా వున్నాడు. రాజు తన భటులచేత కుర్రవాణ్ణీ, ధనాన్నీ రాజభవ నానికి పట్టించుకు పోయాడు.

కుర్రవాడికి చంద్రప్రభుడని పేరు పెట్టు కున్నారు. ఎంతో గారాబంగా, యేలోటూ రాకుండా పెంచారు. సకల విద్యలూ నేర్పించారు. వాడికి యుక్తవయసు రాగానే యౌవరాజ్య పట్టాభిషేకంకూడా చేశారు.

తరవాత కాలక్రమాన ముసలిరాజు చని పోయాడు. చంద్రప్రభుడు శాస్త్రోక్తంగా ఉత్తరక్రియలు చేసి, ప్రయాగవద్ద త్రివేణి

లోనూ, కాశీవద్ద గంగలోనూ తర్పణాలు విడిచాడు. తరవాత అతను తండ్రికి పిండం వెయ్యటానికి గయకు వెళ్ళాడు. గయా కూపంలో అతను పిండం వెయ్యబోయే సమయానికి నీటిలోనుంచి మూడు చేతులు పైకి లేచాయి. అందులో ఒక చెయ్యి సంకెళ్ళ గుర్తులు గలిగి దొంగ చెయ్యిలాగా ఉంది. రెండవది పవిత్రం ధరించి బ్రాహ్మడి చెయ్యిలాగా ఉంది. మూడవది ఉంగరం ధరించి రాజు చేయిలాగా వుంది.

బేతాళు డింతవరకు కథ చెప్పి, "రాజా, చంద్రప్రభుడు పిండాన్ని దొంగ చేతిలో పెట్టాలా? స్వయంగా తన తండ్రి అయిన బ్రాహ్మడి చేతిలో పెట్టాలా? లేక, తనను పెంచి, పెద్దవాణ్ణి చేసి, తన రాజ్యానికి వారసుణ్ణి చేసిన రాజు చేతిలో పెట్టాలా? వారు ముగ్గురిలోనూ అతడు ఎవరి కొడుకు? సమాధానం తెలిసి చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"ఆపిండం దొంగకే చెందుతుందనటానికి సందేహంలేదు. ఎందుకంటే చంద్రప్రభుడు దొంగ కొడుకేతప్ప మిగిలిన ఇద్దరికీ కొడుకు కాడు. విష్ణుస్వామి ధనంకోసం ధనవతికి అమ్ముడుపోయినవాడు. ఇక రాజు చంద్రప్రభుణ్ణి; చంద్రప్రభుడి డబ్బుతోనే పెంచి పెద్దవాణ్ణి చేశాడు. ధనవతి దొంగకే ధారాదత్తమయింది. క్షేత్రజ్ఞ పుత్రుడు తనకు మంచి లోకాలు కల్పిస్తాడనే ఆశతోటే దొంగ ఆమెను దానం పుచ్చుకున్నాడు. దొంగ సొమ్ముకోసరమే విష్ణుస్వామి ధనవతిని పెళ్ళాడాడు. ఆ దొంగ సొమ్ముతోనే రాజు కుర్రవాణ్ణి పెంచాడు. అందుచేత ఆ దొంగకే చంద్రప్రభుడు పిండం వెయ్యాలి. అదే ధర్మసమ్మతం," అని విక్రమార్కుడు జవాబిచ్చాడు.

ఈవిధంగా రాజుకు తిరిగీ మౌనభంగం కాగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు.



# ద్వార రక్షణ

ఒక దుకాణదారు పనిమీద బయటికి వెళుతూ, తన గుమాస్తాతో, "ఒరే, నేను బయటికి వెళుతున్నాను. నేను వచ్చేదాకా వాకిలి భద్రంగా చూస్తూండు," అని చెప్పాడు.

మరి కొంతసేపటికి, ఊళ్ళో ఎక్కడో నృత్య ప్రదర్శనం జరుగుతున్నట్టు గుమాస్తాకు తెలియవచ్చింది. వాడికి అక్కడికి పోయి నృత్యం చూడాలనిపించింది. అయితే యజమాని, "వాకిలి భద్రం!" అని చెప్పాడు. అందుచేత గుమాస్తా దుకాణం వాకిలి తవ్వితీసి, అది మోసుకుని నృత్యం చూడబోయాడు.

తరవాత దుకాణదారు వచ్చి చూసుకుంటే దుకాణమంతా కొల్లగొట్టి ఉన్నది. దుకాణం వాకిలి లేదు. మరి కాస్సేపటికల్లా గుమాస్తా దుకాణం వాకిలితోసహా చిరునవ్వు నవ్వుతూ పరిగెత్తుకుంటూ తిరిగి వచ్చాక, దుకాణదారుకు తన గుమాస్తా ప్రయోజకత్వం అర్థమైంది!





# శివరాత్రి మహిమ

కాంపిల్య నగరంలో దీక్షితుడనే వేద పండితు డుండేవాడు. ఆయనకు లేకలేక ఒక కుమారుడు కలిగాడు. వాడికి యజ్ఞదత్తుడని పేరు పెట్టుకుని తల్లిదండ్రులు ఎంతో గారాబంగా పెంచసాగారు. దీక్షితుడు రోజూ రాజసభకు వెళ్ళి వస్తూండేవాడు. అందుచేత కొడుకు శిక్షణగురించి తండ్రి స్వయంగా శ్రద్ధ వహించలేకపోయాడు. తల్లి గారాబం యజ్ఞదత్తుణ్ణి బాగా పాడుచేసింది.

కొంతకాలానికి తండ్రి యజ్ఞదత్తుడికి ఉపనయనం చేసి గురువువద్ద చదువు ఏర్పాటు చేశాడు. యజ్ఞదత్తుడికి చిన్నతనంలోనే చదువుమీదకన్న జూదంలో ఎక్కువ ఆసక్తి పుట్టింది. జూదంలో వాడు బాకీలు పడి ఇంటికివచ్చి తల్లితో చెప్పేవాడు. ఆమె మారు మాటాడకుండా తన వంటిమీద గల నగ ఏదో ఒకటి తీసి వాడికిచ్చేది.

ఎప్పుడైనా దీక్షితుడు, యజ్ఞదత్తుడి విషయం అడిగితే భార్య, "వాడు చక్కగా చదువుతున్నాడు. రోజూ హోమం చేస్తున్నాడు, సంధ్యవార్చుతున్నాడు" అని జవాబు చెబుతూ వచ్చేది.

ఒకనాడు దీక్షితుడు రాజసభనుంచి ఇంటికి వస్తూండగా దారిలో ఒక మనిషి చేతికి తన వజ్రపుటుంగరం ఉండటం చూసి, "ఇది నా ఉంగరం, నీకెలా వచ్చింది?" అని అడిగాడు.

"అయ్యా, మీ అబ్బాయి జూదంలో నాకు ఓడిపోయి బాకీకింద ఇది ఇచ్చేశాడు." అన్నాడు ఆ మనిషి.

"మావాడు జూదం ఆడతాడా?" అని దీక్షితుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"మీకింకా తెలియదా? వాడికి రాత్రీ పగలూ మరొక పనేలేదు," అని ఆ మనిషి సమాధానం చెప్పాడు.

కె. రంగనాథరావు

దీక్షితుడికి చెప్పరాని సిగ్గూ, పట్టరాని కోపమూ వచ్చాయి. ఆయన గబగబా ఇంటికి పోయి పెట్టెతీసి చూస్తే తన ఉంగరంతోపాటు ఇంకా అనేక బంగారు వస్తువులు మాయమైవుండటం కనిపించింది.

"ఇటువంటి కొడుకు ఉండటంకన్న పుంనరకం మేలు. ఒసే, కాసిని నువ్వులు పట్టుకురా! ఆ వెధవకు ఇప్పుడే తర్పణాలు విడిచేస్తాను!" అన్నాడు దీక్షితుడు భార్యతో.

తన గారాబాల కొడుకును భర్త ఫెళ్లున అంతమాట అనేసరికి భార్యకు ఉక్రోషం కలిగి, ఆవిడ యజ్ఞదత్తుణ్ణి వెనకవేసుకు వచ్చింది. తన భార్య అలుసుతోనే కొడుకింత ప్రజ్ఞావంతుడైనాడని దీక్షితుడికి తెలిసి పోయింది. ఆయన తన భార్యనూ, కుమారుణ్ణీ తిడుతూ కేకలు వేయసాగాడు.

అప్పుడే ఇల్లు చేరుకుంటున్న యజ్ఞదత్తుడు ఈ కేకలు విని తన రహస్యం తన తండ్రికి తెలిసిపోయినట్టు గ్రహించాడు. వాడికి తండ్రి ఎదటపడే ధైర్యం లేక పోయింది. వాడు వెంటనే వెనక్కు తిరిగి ఆ ఊరువిడిచి పోసాగాడు.

యజ్ఞదత్తుడు అరణ్యమార్గాన పడి పోతూండగా కొందరు దొంగలు చూశారు. వాడి అవతారమూ, దుస్తులూ చూస్తే ధనికుడని వాళ్ళకు తోచింది. వాళ్ళు వాడిమీద పడి కర్రలతో కొట్టారు. స్పృహతప్పి పడిపోయిన యజ్ఞదత్తుడి దగ్గిర దొంగలకు చిల్లిగవ్వకూడా దొరకలేదు. వాణ్ణి అడవిలోనే విడిచిపోతే తెల్లవారినాక ఎవరో ఒకరు చూసి అడివియావత్తూ ఘాలించి తమ రహస్య ప్రదేశాలు తెలుసుకుంటారు. ఆ భయంతో దొంగలు వాణ్ణి మోసుకొని దగ్గిరవున్న ఒక పల్లెలో పడేసి వెళ్ళిపోయారు.




ఆ పల్లెలో వుండే ఒక కాపువాడు తెల్లవారుజామున తలుపు తెరుచుకుని బయటికి వచ్చేసరికి వీధిలో పడివున్న యజ్ఞదత్తుడు కనిపించాడు. కాపుఅతన్ని లోపలికి

తెచ్చి భోజనం పెట్టి చికిత్స చేయించాడు. యజ్ఞదత్తుడు త్వరలోనే స్వస్థుడయాడు.

ఈ కాపు కుమార్తె పెళ్ళి యీడుది. యజ్ఞదత్తుడు రహస్యంగా ఆమెతో స్నేహం చేసుకుని, ఆమెకు మాయమాటలు చెప్పి, ఒక నాటి రాత్రి ఆమెతోసహా కాపుకు తెలియకుండా బయలుదేరాడు. ఇద్దరూ చాలా రోజులు ప్రయాణంచేసి ఒక మాలపల్లె చేరారు. కాపు తనకోసం వెతికించే పక్షంలో ఈ మాలపల్లెలో తల దాచుకోవటం క్షేమమని యజ్ఞదత్తుడికి తోచింది.

కాని మాలపల్లెలో యజ్ఞదత్తుడికి కావలసినదేమీలేదు. అందుచేత అక్కడ కొన్నాళ్ళుండి అతను భార్యతోసహా బయలుదేరి ఒక పట్టణం చేరుకున్నాడు. అక్కడ దొంగతనాలుచేసి జీవించే శబరుల స్నేహం చేసి తానుకూడా దొంగతనాలు చేయసాగాడు. అయితే దొంగతనాలు చెయ్యటంలో వారికి గల నేర్పు లేనందున యజ్ఞదత్తుడు పట్టుబడే పరిస్థితి ఏర్పడింది. అతను తన భార్యతో మళ్ళీ ప్రయాణం సాగించాడు.

ఈ విధంగా, యజ్ఞదత్తుడు ఎక్కడా స్థిరపడి సుఖంగా బతకలేక, ఒక ఊరి నుంచి మరొక ఊరికిపోతూ చిట్టచివరకు కాశీనగరం చేరాడు. అక్కడ దొంగతనాలు చేస్తూ యెలాగో కాలం గడపసాగాడు.



ఇంతలో శివరాత్రి వచ్చింది. శివరాత్రికి కాశీకి ఎంతోమంది యాత్రికులు వస్తారు. అందరిదగ్గిరా డబ్బూ, నగలూ ఉంటాయి. ఈరోజు తన దరిద్రం తీరిపోయిందనుకుని యజ్ఞదత్తుడు తెల్లవారుజామునే గంగకు వెళ్ళి స్నానంచేశాడు. ఎన్నో వేలమంది యాత్రికులు తమ మూటలు ఒడ్డునపెట్టి స్నానాలు చేస్తున్నారు. అడుగడుగునా రక్షకభటులుండటంచేత యజ్ఞదత్తుడు యేమీ చెయ్యలేక పోయాడు.

అతను గంగనుంచి ఒడ్డుకువచ్చి, ఈ రక్షకభటులను తప్పించుకోవటానికి విశ్వేశ్వరాలయం ప్రవేశించాడు. అనేకమంది స్త్రీలూ, పురుషులూ ఆలయం చుట్టూ ప్రదక్షిణం చేస్తున్నారు. వారిలో ఒకడులాగా యజ్ఞదత్తుడుకూడా ఆలయంచుట్టూ ఎన్నో వేలసార్లు ప్రదక్షిణాలు చేశాడు. కాని ఒక్క వస్తువుకుడా అపహరించే అవకాశం అతనికి దొరకలేదు.

సూర్యాస్తమయమయింది. యజ్ఞదత్తుడు ఆ రోజల్లా పచ్చి మంచినీళ్ళు తాగిఎరగడు. ఆకలి దహించేస్తోంది. అతను గుడిలోకి వెళ్లాడు. అక్కడ శివపూజ జరుగుతున్నది. ఒక శివభక్తుడు ఒక కుండలో చతుర్విధాన్నాలు పెట్టుకొని తెల్లవారుజామున శివార్చన చేసి పారణచేద్దామనే ఉద్దేశంతో ఒక



మూల కూచున్నాడు. యజ్ఞదత్తుడుకూడా ఆ సమీపంలోనే కూచుని పూజ చూస్తు న్నట్టు నటించసాగాడు.

క్రమంగా రాత్రి నాలుగు జాములూ గడిచి అరుణోదయంవేళ అయింది. శివ భక్తుడు నిద్ర ఆపలేక కళ్ళుమూసి జోగ సాగాడు. ఈ అవకాశం చూసుకుని యజ్ఞ దత్తుడు లేచి, దీపారాధన వత్తి పైకి తోసి ఆ వెలుగులో కుండతీసుకుని ఒక్క పరుగు తీశాడు. అయితే ప్రమాదవశాన అతని కాలు శివభక్తుడికి తగిలింది.

శివభక్తుడు వెంటనే కళ్ళు తెరిచి, "దొంగ, దొంగ" అని కేకవేశాడు. వెంటనే కొందరు దొంగ వెంటపడ్డారు. యజ్ఞదత్తుడు కుండను పట్టుకుని ఎవరికీ అందకుండా పరిగెత్తి పోసాగాడు. దారిలో తలారి ఒకడు యజ్ఞదత్తుణ్ణి చూసి బాణం యెక్కుపెట్టి వదిలాడు. అది యజ్ఞదత్తుడి గుండెలో తగిలి అతను వెంటనే ప్రాణం విడిచాడు.

చచ్చిపోయిన యజ్ఞదత్తుడికోసం యమ కింకరులూ, విమానంతోసహా విష్ణు కింక రులూకూడా వచ్చారు.

యమ కింకరులు, "వీడికోసం మీ రెందుకు వచ్చారు? వీడు జన్మలో ఒక్క మంచి పని చేసియెరగడు. కులభ్రష్టుడు, జూదరి, దోపిడిగాడు, వంచకుడు!" అన్నారు.

"అది నిజమే. అయినా వీడు శివరాత్రి నాడు ఉదయమే లేచి గంగాస్నానం చేశాడు. రోజల్లా శివాలయంచుట్టూ ప్రదక్షిణలు చేశాడు. దినమంతా ఉపవాసం వున్నాడు. రాత్రి అంతా జాగరణచేసి శివపూజచేశాడు. ఇక వీడికి పాపం ఎక్కడిది!" అన్నారు విష్ణు కింకరులు.

అయినా యమ కింకరులు ముందుకు వచ్చారు. కాని అతన్ని అంటటం వారితరం కాలేదు. వారు చూస్తూండగానే విష్ణు కింకరులు, యజ్ఞదత్తుణ్ణి విమానంలో యెక్కించుకొని వెళ్ళిపోయారు.



# పోటా పోటీ

ఒక గురువువద్ద ఇద్దరు శిష్యులుండేవారు. వారికి ఒక్క క్షణంకూడా పడేది కాదు. వారిద్దరికీ తగాదా రాకుండా చూసేసరికి గురువుకు తల ప్రాణం తోకకు వస్తూండేది. అఖరుకు, ఆయన నిద్రపోయేముందు కాళ్ళు వత్తేటప్పుడుకూడా వాళ్లు తగూ పడుతూండేవారు. అందుచేత గురువుగారు తన కుడికాలు ఒకడికీ, ఎడమకాలు మరొకడికీ పంచాడు.

ఇలావుండగా ఒకసారి ఒక శిష్యుడు; గురువుగారి ఎడమ కాలు పట్టే వాడు, ఊరికి వెళ్లవలసి వచ్చింది. ఆ రాత్రి రెండో శిష్యుడు గురువుగారి కుడి కాలు మాత్రం పట్టి వెళ్లిపోబోయాడు. "ఒరే, నాయనా, కాస్త ఆ రెండో కాలు కూడా పట్టి మరీ వెళ్ళరా !" అని గురువు వాణ్ణి బతిమాలాడు. కాని ఈ శిష్యుడికి రెండోవాడిమీద ఎంత కోపమో, వాడు పట్టే గురువుగారి కాలిమీదకూడా అంత కోపమే. అందుచేత వాడు ఒక రాయి తెచ్చి గురువుగారి ఎడమకాలు మీద గట్టిగా వేశాడు. పాపం, గురువుగారు బాధతో కేకలుపెట్టి, మూర్ఖుడైన తన శిష్యుణ్ణి తిట్టి, వైద్యుడిచేత కాలికి కట్టు కట్టించుకున్నాడు.

ఇంతలోనే, వూరికి పోయిన శిష్యుడు తిరిగి వచ్చాడు. "తన" కాలు కట్టుకట్టి ఉండటం చూసి, ఆత్రంగా, "గురువుగారూ, కాలుకేమయింది?" అని అడిగాడు. జరిగిన సంగతి గురువు చెప్పాడు.

"దుర్మార్గుడు ఇంతపని చేస్తాడా? నేనేనా అంత చాతగానివాణ్ణి?" అంటూ వాడు మరింత పెద్దరాయి తెచ్చి, గురువు లబలబలాడుతున్నా లక్ష్య పెట్టకుండా, గురువుగారి కుడికాలు చితకగొట్టాడు.






భోజరాజు కొత్త శ్లోకం చదివినవారందరికీ లక్ష చొప్పున ఇవ్వటంవల్ల కొందరు రకరకాల నీచాలకు పాల్పడ్డారు. రాజుకు శ్లోకం కొత్తదిగా వుండటం ప్రధానంగాని, అందులోని భావాలు సరిగా వుండటం ప్రధానంకాదు. ఈ విషయం ఆసరాతీసుకుని శతంజయ కవి అనే క్షుద్రుడు ఈ కింది శ్లోకం రచించాడు.

" అపశబ్ద శతం మాఘే
భారవౌచ శతత్రయం
కాళిదాసే నగణ్యంతే
కవిరేక శ్శతంజయః."

కావటానికిది కొత్త శ్లోకమే. కాని ఇందులో ఉన్న అర్థమేమంటే: "మాఘుని రచనలో నూరు అపశబ్దాలున్నాయి; భారవి రచనల్లో మూడువందల అపశబ్దాలున్నాయి; కాళిదాసు రచనల్లో గల అపశబ్దాలకు అంతేలేదు. శతంజయుడు ఒక్కడే కవి."

ఈ శ్లోకంలో శతంజయుడు తానొక్కడే కవినని చెప్పుకోవటమేగాక, కాళిదాసు, భారవి, మాఘుడులాటి కవి దిగ్గజాలను నిందించాడు. ఈ నిందకు ఆధారం లేకపోయినా, శ్లోకం కొత్తదిగనక భోజుడు లక్ష ఇస్తాడు. కవిదిగ్గజాలను నిందించిన శ్లోకానికి భోజరాజునుంచి బహుమతి పొంది, ఆ విషయం అందరికీ చెప్పి పరిహాసం చెయ్యటమే శతంజయుడి ఉద్దేశం.

అయితే ఈ శ్లోకాన్ని చేతపట్టుకుని స్వయంగా భోజరాజు ఆస్థానానికి వెళ్లటానికి శతంజయుడికి గుండె చాలలేదు. అందుచేత అతను తన శిష్యుణ్ణి ఒకణ్ణి పిలిచి, "ఒరే, ఈ శ్లోకం తీసుకుపోయి భోజరాజు ఆస్థానంలో చదువు. రాజు లక్ష ఇస్తాడు. పట్టుకురా!" అన్నాడు.

శతంజయుడి శిష్యుడు శ్లోకం పుచ్చుకుని ఆస్థానంవేపు పోతూండగా అతనికి

జి. వరదాచార్యులు

దైవికంగా కాళిదాసు కనిపించాడు. అయన కాళిదాసని అతడికి తెలీదు.

"బాబూ, తమరు ఆస్థానానికి వెళుతున్నారా ఏమిటి?" అని శిష్యుడు కాళిదాసు నడిగాడు.

"అవును. ఎందుకడిగావు?" అన్నాడు కాళిదాసు.

"నన్నుకూడా మీవెంట తీసుకుపోతారా? నాకు దారి తెలియదు," అన్నాడు శిష్యుడు.

"నీకు ఆస్థానంలో ఏం పని?" అని అడిగాడు కాళిదాసు.

"మా గురువుగారు ఒక శ్లోకం రాసి ఇచ్చారు. దాన్ని రాజుగారిదగ్గిర చదివి బహుమానం పట్టుకురమ్మన్నారు. అందుకని నేను భోజరాజు ఆస్థానానికి పోతున్నాను. నేను కొత్తవాణ్ణి. రాజభటులు నన్ను అడ్డగిస్తారేమో! తమరు నాయందు దయవుంచి ఎలాగైనా నన్ను ఆస్థానం చేర్చండి." అన్నాడు శిష్యుడు.

కవి స్వయంగా రాక, శిష్యుణ్ణి ఎందుకు పంపుతున్నాడా అని కాళిదాసుకు అనుమానం కలిగి, "ఏదీ శ్లోకం!" అన్నాడు.

శిష్యుడు కాళిదాసుకు శతంజయకవి రాసిన శ్లోకం ఇచ్చాడు. దాన్ని చదవగానే కాళిదాసుకు కవియొక్క దుర్బుద్ధి తెలిసిపోయింది. అయన చప్పరించి, శ్లోకం తిరిగి



ఇస్తూ, "ఈ శ్లోకంలో ఒక చిన్న తప్పుంది. అదే లేకపోతే బహుమానం తప్పక వచ్చును," అన్నాడు.

"బాబ్బాబు, ఆ తప్పేదో తమకు తెలిస్తే దిద్దిపెడుదురూ! బహుమానం లేకుండా వట్టిచేతులతో తిరిగిపోతే గురువుగారు కోప్పడతారు!" అని శిష్యుడు కాళిదాసును ప్రాధేయ పడ్డాడు.

కాళిదాసు శ్లోకం మళ్ళీ తీసుకుని, దాని మొదట్లో ఉన్న "అ" అక్షరాన్ని "ఆ"గా దిద్దాడు. ఆ కాస్త మార్పుతో శ్లోకం అర్థమంతా పూర్తిగా మారిపోయింది.

శతంజయకవి శిష్యుడు కాళిదాసువెంట ఆస్థానానికి వెళ్లాడు. భోజరాజు అతను వచ్చిన పని అడిగాడు. కొత్తశ్లోకం ఒకటి చదవటానికి రాజాజ్ఞ పొంది, కాళిదాసు చేసిన మార్పుతోసహా ఇలా చదివాడు:

"ఆప శబ్ద శతం మాఘే
భారవౌచ శతత్రయం
కాళిదాసే నగణ్యంతే
కవిరేక శ్శతంజయః."

ఇప్పుడు శ్లోకం అర్థం ఇలా వుంది: శతంజయుడనే ఒకానొక కవి మాఘుడి నుంచి నూరు మాటలూ, భారవినుంచి మూడువందల మాటలూ, కాళిదాసునుంచి లెక్కలేనన్ని మాటలూ తీసుకున్నాడు."

ఈ శ్లోకం వినగానే భోజరాజూ, సభికులూ గొల్లున నవ్వారు. శ్లోకానికి బహుమానం రాలేదు. శతంజయకవి శిష్యుడు సిగ్గుపడి, తలవంచుకుని వెళ్లిపోయి, జరిగినదంతా తన గురువుగారికి విన్నవించాడు. తన పేరు నవ్వులపాలయిందని గ్రహించి శతంజయకవి ధారానగరం చాయల లేకుండా వెళ్లిపోయాడు.

తరవాత కాళిదాసు భోజరాజుకూ, ఇతర పండితులకూ జరిగిన సంగతి తెలిపాడు. వారందరూ కాళిదాసు చాతుర్యాన్ని ఎంతో అభినందించారు.





# తల్లీ కూతుళ్లు

## 2

ఈలోపల దిలైలా తాను ధరించిన సూఫీ భిక్షుకురాలి వేషం విప్పేసి, ఒక భాగ్యవంతుల పనిమనిషి వేషం వేసుకుని, తన ప్రతాపంతో బగ్దాద్ పౌరులను వేపుకుతినటానికి మళ్ళీ బయలుదేరింది. ఆమె ఒక సందు చేరేసరికి అక్కడ ఒక ఇంట్లో తివాసీలూ, మేళతాళాలూ, దీపాలూ, పాటలూ, వేడుకలూ, కోలాహలమూ కనిపించింది. ఇంటి తలవాకిట ఒక బానిస మనిషి చిన్న కుర్రాణ్ణి చంకన వేసుకుని వున్నది. కుర్రాడి వొంటినిండా వెండి బంగారు జరీగల దుస్తులూ, రత్నాలు పొదిగిన ఆభరణాలూ, ముత్యాలచేర్లూ ఉన్నాయి.

ఆ ఇల్లుగలాయన బగ్దాద్ వర్తకులకు పెద్ద. ఆ రోజున ఆయన కుమార్తెకు ప్రధానం చేస్తున్నారు. చాలామంది అమ్మలక్కలు పేరంటం వచ్చారు. వర్తకుడి భార్య వచ్చినవారికి ఆతిథ్యం ఇవ్వటానికి వీలులేకుండా చిన్నకొడుకు ఆమెను పట్టుకుని మారాం చెయ్యసాగాడు. అందుచేత ఆవిడ వాణ్ణి బానిసదానికిచ్చి, వచ్చినవాళ్లు వెళ్ళేదాకా కాస్త ఆడిస్తూ వుండమన్నది. ఈ విషయాలన్నీ దిలైలా వీధిలోనే ఆరా తీసింది. ఆ కుర్రవాడి వంటిమీది నగలు కాజేయాలని ఆమెకు దుర్బుద్ధి పుట్టింది.

దిలైలా జనంలోనుంచి తోసుకుని తలవాకిలి దగ్గిరికి వస్తూ, "నా ఇల్లు బంగారం కానూ, ఆలస్యం చెయ్యనేచేశాను!" అని గట్టిగా అన్నది. తరవాత ఒక చెల్లని నాణెం తీసి బానిసదాని చేతిలో పెట్టి, "మీ పాత దాది, ఉమాల్ ఖయుర్ సలాములు చెప్ప వచ్చిందని అమ్మగారికి కాస్త చెప్పిరా, తల్లీ," అన్నది. బానిస నాణెం తీసుకుంటూ, "అబ్బాయిగారు అమ్మగారు కనిపిస్తే

ఎస్. వెంకటసుబ్బయ్య

కొంగు పట్టుకుని పదలక మారాంచేస్తారు. నే నెట్లా వెళ్లే దమ్మా ?" అన్నది

"నువు వచ్చేదాకా నేను పట్టుకుంటాలే చిట్టి తండ్రిని !" అన్నది దిలైలా. బానిస ఈ మాటలు నమ్మి, పిల్లవాణ్ణి దిలైలాకిచ్చి లోపలికి వెళ్ళిపోయింది.

వెంటనే దిలైలా పిల్లవాణ్ణి తీసుకుని ఒక నిర్మానుష్యమైన గొందిలోకి పోయి పిల్ల వాడి వంటిమీద వున్న ఖరీదైన నగలూ, బట్టలూ ఊడ్చేసింది. తరవాత వాణ్ణి తీసుకుని ఒక గొప్ప రత్నవర్తకుడి దుకాణానికి వెళ్ళింది. ఆ వర్తకుడు వర్తకుల పెద్ద యొక్క కుమారుణ్ణి వెంటనే ఆనవాలుపట్టి, "మీ యజమానికి ఏం కావాలి?" అని దిలైలాను అడిగాడు.

"ఈ పిల్లవాడి అక్కకు ప్రధానం చేస్తున్నారు. ఒక జత బంగారు గాజులూ, రెండు జతల బంగారు పాంజేబులూ, పరహాల చెవికమ్మలూ, నగిషీ వడ్డానమూ కావాలి. మొత్తం వెయ్యి దీనారాలకు తక్కువ కాకుండా సొమ్ములు ఇప్పించండి. సరుకు తీసుకుపోయి అమ్మగారికి చూపించి, నచ్చితే డబ్బు తీసుకుని ఇప్పుడే వస్తాను. కావలిస్తే అందాకా అబ్బాయినిక్కడే వుంచి పోతాను," అన్నది దిలైలా. "నీ యిష్టం. కాని అబ్బాయిని వుంచవలిసిన అవసరం



మటుకు లేదు," అన్నాడు రత్నవర్తకుడు. దిలైలా తనుదోచిన సొమ్మంతా తీసుకుని సరాసరి ఇంటికి వెళ్లిపోయింది.

అక్కడ వర్తకుల పెద్ద ఇంట్లో సంబరం కాస్తా శోకాలకింద మారింది. ఇంటి పెద్ద వచ్చేసరికి ఇల్లు అల్లకల్లోలంగా ఉన్నది. వర్తకుడి భార్య కొడుకుకోసం పొర్లిగింతలు పెట్టి ఏడుస్తున్నది. పిల్లవాడి జాడ ఎవరికీ తెలీదు. వర్తకుడు చాలాసేపు వెతికించిన మీదట, పిల్లవాడు రత్నవర్తకుడి దుకాణంలో దొరికాడు.

"దొంగవెధవా, నా పిల్లవాణ్ణి ఏమని తెచ్చావు? వాడి వంటిమీది నగలూ, దుస్తులూ ఏవి?" అని వర్తకుల పెద్ద ఆగ్రహంతో అడిగాడు.

"తమ యింటికి వెయ్యి దీనారాల నగలు పంపాను. వాటి మాటేమిటి?" అని విలవిలలాడాడు రత్నవర్తకుడు.

ఇద్దరూ ఒకరినొకరు అర్థంచేసుకోవటానికి చాలాకాలం పట్టింది. ఆసమయానికే దిలైలా మోసగించిన మొదటి ముగ్గురూ అక్కడికి వచ్చారు. అందరినీ మోసగించినది ఒక మనిషేనని తేలిపోయింది. ఒకరి కథ ఒకరికి చెప్పుకున్నారు.

"ఈ ముసలిదాని అంతు కనుక్కుంటే గాని నేను నిద్రపోను," అని వర్తకులపెద్ద





శపథం చేశాడు. రత్నవర్తకుడు మిగిలిన ముగ్గురితో, "మీతోబాటు నేనుకూడా ముసలిదాన్ని పట్టటానికి వస్తాను. కాని అందరమూ కలిసి వెతికితే లాభం ఉండదు. ఎవరిదారినవారు వెళ్ళి వెతుకుదాం. మధ్యాన్నానికి అందరమూ హజ్ మసూద్ అనే మంగలి దుకాణం దగ్గిర కలుసుకుందాం," అన్నాడు.

మధ్యాన్నంవేళకు గాడిదగల కుర్రవాడు మంగలి మసూద్ దుకాణంకేసి వెళుతుండగా వాడికి దిలైలా కనిపించింది. మారువేషంలో ఉన్నప్పటికీ వాడామెను గుర్తించి, "దొరికావా, దొంగపీనుగా?" అన్నాడు.



"అదేమిటి, నాయనా?" అన్నది దిలైలా అమాయికంగా.

"నా గాడిద! నాగాడిదను నాకిచ్చి మరీ మాట్లాడు!" అన్నాడు కుర్రాడు.

"ఎందుకట్లా అరుస్తావు? నీ గాడిదను నేనెత్తుకుపోయాననుకున్నావా? మంగలి మసూదుదగ్గిర దాచిపెట్టా. నావెంటరా, నీ గాడిదను నీ కిప్పిస్తా," అన్నది దిలైలా. కుర్రాడామెవెంట బయలుదేరాడు. వాణ్ణి దుకాణంబయట ఉండమని, దిలైలా లోపలికి వెళ్ళి, కళ్లనీళ్లు పెట్టుకుంటూ మంగలి మసూదుతో, "ఇది నువు కుదర్చవలిసిందే బాబూ!" అన్నది.

"ఏమిటి, పిన్నమ్మా? అసలు విషయం చెప్పు," అన్నాడు మసూద్.

"అడుగో, నాయనా, బయట ఉన్నాడే వాడు నాకొడుకు. చచ్చేఖాయిలాపడి కోలుకున్నాడు. కాని వాడిబుద్ధి పుచ్చిపోయింది. ఎప్పుడో చిన్నప్పుడు వాడికి గాడిద ఒకటి ఉండేది. దానికోసం ఇప్పుడు ఒకటే కలవరింత! అస్తమానం గాడిదో, గాడిదో అని కలవరిస్తాడు. వాడిపిచ్చి నువే నయం చెయ్యాలి," అన్నది దిలైలా.

అవిడ చేతిలోపెట్టిన దీనారం తీసుకుంటూ మసూద్, "అదెంతపని? తల

గొరిగేసి నిమ్మకాయ రసం అంటాసంటే మూడు పూటల్లో గుణం ఇస్తుంది," అన్నాడు.

"మంచి మాటలతో వాణ్ణి పిలిచి చికిత్స చెయ్యి, నాయనా! నీరుణం ఉంచుకోనులే!" అన్నది దిలైలా. మసూద్ దుకాణం బయటికి వచ్చి, కుర్రాణ్ణి చూసి, "లోపలికి రా!" అని పిలిచాడు.

"నా గాడిద?" అన్నాడు కుర్రాడు.

"నీ గాడిద నాదగ్గిరే ఉంది. అదెక్కడికి పోతుంది? ఒక క్షణం లోపలికి రా!" అన్నాడు మంగలి మసూద్.

కుర్రాడు వసారాలోకి రాగానే మసూద్ నౌకర్లు వాణ్ణి పెడరెక్కలు విరిచి కట్టారు. మసూద్ వాడి తల యాపత్తూనున్నగా గొరిగి, నిమ్మరసం అంటాడు. కుర్రాడు పెద్దగా కేకలు పెట్టసాగాడు.

మసూద్ చికిత్స పూర్తిచేసి తన దుకాణం లోపలికిపోయి చూసేసరికి ముసలి దాని జాడ లేకపోగా, కత్తులూ, అద్దాలూ, కత్తెరలూ, తలనూనెలూ, మర్దనతైలాలూ, అత్తరులూ, బల్లలూ, కుర్చీలూ, సమస్తమూ మాయమయాయి.

మసూద్ కుర్రాడిదగ్గిరికి వచ్చి గొంతు పట్టుకుని, "మీ అమ్మ ఎక్కడరా, పిశాచమా?" అని అడిగాడు.



"మా అమ్మపోయి ఎంతకాలమాయె! నా గాడిద నిస్తానన్నావు. వెంటనే ఇచ్చెయ్యి," అన్నాడు కుర్రాడు, తల తడుముకుంటూ.

వీళ్ళిట్లా ఘర్షణపడే సమయంలో మిగిలినవాళ్ళుకూడా అనుకున్న ప్రకారం ఆ దుకాణం చేరుకున్నారు. జరిగినదంతా తెలుసుకున్నాక ముసలిది మరొక మోసం చేసిందని తేలింది. మంగలి మసూద్‌తో కూడా కలిసి అందరూ ముసలిదాన్ని పట్టుకోవటానికి బయలుదేరారు.

వారు చాలావీధులు తిరిగి ఒకచోటికి వచ్చేసరికి, గాడిదగల కుర్రవాడికి దిలైలా మళ్ళీ కనిపించింది. వాడు చప్పున ఆమె

మీదపడి పట్టుకుని, "ఇదుగో ముసలి ముండ! ఈసారి తప్పించుకు పోనివ్వకండి!" అని అరిచాడు.

అందరూ కలిసి ఆమెను పట్టుకుని ఖాలిద్ ఇంటికి తీసుకుపోయి, అక్కడి భటులతో, "మేము ఖాలిద్‌గారి దర్శనం వెంటనే చెయ్యాలి," అన్నారు.

ఖాలిద్ నిద్రపోతున్నాడు. ఆయన లేచే దాకా ఆగమని భటులు మగవారినయిదుగుర్నీ బయటి ఆవరణలో కూచోబెట్టి, దిలైలాను జనానాభాగంలో ఒక గదిలోకి పంపించారు. దిలైలా ఆగదిలోనుంచి ఇంకా లోపలికి వెళ్ళి, అనేక గదులుదాటి మేడ మీద ఖాలిద్ భార్య ఉండే చోటికి పోయింది. ఆమెకు సలాంచేసి, "మా దగ్గరవున్న బానిసలను మీభర్తగారు పన్నెండు వందల దీనారాలకు బేరంచేశారు. వారిని వప్పగించటానికి తీసుకొచ్చాను. ఆయన నిద్రపోతున్నట్టు తెలిసింది. వారు నిద్రలేచేసరికి ఏవేళ అవుతుందో?" అన్నది.

ఖాలిద్ భార్య, "ఆ సంగతి నాకు తెలియదుగాని బానిసలను కొంటానని మాత్రం నాతో ఎప్పుడో అన్నారు. అయినా మీ బానిస లెక్కడ?" అని అడిగింది.

"బయటే వున్నారు. కిటికీలోనుంచి చూస్తే కనిపిస్తారు. అందరూ మంచి పుటక



గలవారే లెండి. ఆ విషయం సందేహం అక్కర్లేదు," అన్నది దిలైలా.

బయట నిలుచున్న వారినందరినీ కిటికీ లోనుంచి చూసి ఖాలిద్ భార్య చాలా తృప్తిపడింది. ఆవిడ దిలైలాతో, "డబ్బు నేనే ఇద్దునుగాని, నాదగ్గర వెయ్యి దీనా రాలే ఉన్నాయే, ఏం చెయ్యను?" అన్నది.

"వెయ్యి చాలుగదండీ? రెండువందలు అదివరకే బయానాగా తీసుకున్నాగా?" అన్నది దిలైలా. ఆమె వెయ్యి దీనారాలూ పుచ్చుకుని సలాంచేస్తూ, "కూచోబెట్టకుండా నా పని ముగించి చాలా పుణ్యం కట్టు కున్నారు. నాకు మా బానిసల ముఖాలు చూడటానికి చాలా బాధగావుంది. మీరు మరోలా అను కోక, నన్ను దయచేసి దొడ్డి దారిన పంపించెయ్యండి," అని కోరింది.

ఖాలిద్ నిద్రలేచాక ఆయన భార్య, "మొత్తానికి చాలా మంచి బేరమే చేశారే?" అంటూ, బానిసల సంగతి చెప్పి అభి నందించింది.

అంతా విని ఖాలిద్ విస్మయంతో, "బానిసలేమిటి? బేరమేమిటి? నేనెవరికీ బయానా ఇవ్వలేదే!" అన్నాడు.

"అదేమిటి? నేనా ముసలావిడకు వెయ్యి దీనారాలూ ఇచ్చేశాను. ఆమె వదలి వెళ్లిన బానిసలు కింద ఉన్నారు," అన్నది





ఖాలిద్ భార్య. ఖాలిద్ గబగబా కిందికి వెళ్లి, తనకోసం వేచివున్న దుకాణదారునూ, కలంకారీవాణ్ణీ, రత్నాలవర్తకుణ్ణీ, మంగలి మసూద్‌నూ, గాడిద గల కుర్రవాణ్ణీ చూసి, చాలా ఆశ్చర్యపడ్డాడు.

"మీరేనా నేను కొన్న బానిసలు?" అని ఆయన వారినడిగాడు.

"ఇదేనా మీరు మాకు చేసే న్యాయం? మేము బానిసలమా? ఖలీఫా నడుగుదాం పదండి!" అన్నారు వారు.

ఆ సమయానికే ముస్తఫాకూడా అక్కడికి వచ్చాడు. ఈలోపుగా ఆయన తన భార్యకు ముసలిది చేసిన మోసం తెలుసుకున్నాడు. ఆయన ఖాలిద్‌తో, "మీ నిర్వాహకంకింద ప్రతి ముసలితొత్తూ తన ఇష్టం వచ్చిన కొంపలో జొరబడి అమాయక స్త్రీలను మోసంచెయ్యవచ్చులా కనబడుతుంది! నా భార్యకు జరిగిన మోసానికి ఏమి సంజాయిషీ ఇస్తారు?" అని అడిగాడు.

ఖాలిద్ కంగారుతో, "అయ్యా, ఈ ముసలిదాన్ని శిక్షించే భారం నేను మీద వేసుకుంటాను. మీఅందరికీ దానివల్ల జరిగిన నష్టానికి పరిహారం ఇచ్చుకునే పూచీ కూడా నాదే!" అన్నాడు. ఆయన మిగిలిన అయిదుగురి కేసి తిరిగి, "మీలో ముసలిదాన్ని గుర్తించగల వారెవరు?" అని అడిగాడు.

అయిదుగురూ గుర్తించగల మన్నారు. "మావెంట పదిమంది భటులను ఇప్పించారంటే దాన్ని పట్టితెస్తాంకూడా!" అన్నారు వాళ్లు ఖాలిద్‌తో.

వారు భటులను వెంటబెట్టుకుని కొద్ది దూరం వెళ్లారోలేదో దిలైలా వారి కెదురుపడి, వారినిచూసి పారిపోబోయింది. కాని వారు వెంట తరిమి ఆమెను పట్టుకుని, చేతులు వెనక్కు విరిచికట్టి ఖాలిద్‌వద్దకు తీసుకుపోయారు. దిలైలా ఆటకట్టినట్టే కనబడింది. కాని— (ఇంకా వుంది)



# మతిమాలిన సాక్ష్యం

ఒక గ్రామంలో ఒక ఆసామీకి ఒక గొర్రె ఉండేది. అతను ఒకనాడు పొరుగూరు వెళ్ళివుండగా, ఊరి తుంటరులు కొందరు అతని గొర్రెను కాజేసి, ఊరి బయట చెరువుగట్టున మర్రిచెట్టు కిందికి తీసుకుపోయి, అక్కడ దాన్ని చంపి, వండుకు తిన్నారు.

ఆసామీ పొరుగూరినుంచి తిరిగి వచ్చి, తాను లేని సమయంలో జరిగిన మోసం తెలుసుకుని, తుంటరులపైన న్యాయాధికారివద్ద ఫిర్యాదుచేశాడు.

న్యాయాధికారి ముద్దాయీల నందరినీ పిలిపించి, "ఈ ఫిర్యాదుగురించి మీ సంజాయిషీ ఏమిటి?" అని అడిగాడు.

"ఏలినవారు చిత్తగించాలి. ఈ మనిషి చెప్పే మాటలన్నీ శుద్ధ అబద్ధాలు. అసలు ఇతనికి గొర్రే లేదు. పైపెచ్చు మా గ్రామంలో చెరువూ లేదు, మర్రిచెట్టూ లేదు," అన్నాడు ముద్దాయీలలో ఒకడు.

ఈ మాటలు వినగానే ఆసామీకి మండిపోయి, "మొన్నటి అష్టమినాడు మీరంతా నా గొర్రెను గ్రామానికి తూర్పుగా పట్టుకుపోయి, చంపి తినలేదా?" అని అడిగాడు.

మొదట మాట్లాడిన ముద్దాయి మళ్ళీ న్యాయాధికారికేసి తిరిగి, "అయ్యా, ఇతని మాట ఒక్కటీ నమ్మకండి. మా గ్రామానికి అష్టమీ లేదు, తూర్పూ లేదు," అన్నాడు.

అప్పటితో న్యాయాధికారికి ముద్దాయి అబద్ధమాడుతున్నట్టు స్పష్టమైపోయింది. ముద్దాయీలంతా చందాలు వేసుకుని ఆ ఆసామీకి మరొక గొర్రెను కొనిపెట్టేట్టు ఆయన తీర్పుచెప్పాడు.





# మంగళ ముక్తి

ఇక్షుమతీ నదీతీరాన మంకణుడనే మహాముని ఆశ్రమం నిర్మించుకుని తపస్సు చేసుకుంటూ వుండేవాడు. ఒకనాడా మహాముని ఆశ్రమంలో తిరుగుతూండగా అరటి చెట్ల మధ్య ఆయన కొక శిశువు దొరికింది. మంకణు డాపిల్లను తన కుటీరానికి తెచ్చుకుని, ఆమెకు కదళీ అని పేరు పెట్టుకుని, తన కుమార్తెలాగే పెంచి పెద్దదాన్నిచేశాడు.

కదళి యుక్తవయస్కురాలై వున్న సమయంలో మధ్యదేశపు రాజు ధృఢవర్మ ఆ ప్రాంతాల వేటాడవచ్చి, మంకణ మహాముని దర్శనం చేసుకోవటానికి ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ అతనికి కదళీ కనపడింది. ఆమె సౌందర్యం చూడగానే రాజుకు ఆమెను తప్పక పెళ్ళాడితీరాలనే కోరిక కలిగింది.

వెంటనే రాజు మంకణ మహాముని పాదాలకు ప్రణమిల్లి, "స్వామీ, నా కోరిక ఒకటి వున్నది. నెరవేర్చుతానంటే చెబుతాను," అన్నాడు దీనంగా.

మంకణమహాముని రాజు కోరిక సులువుగా గ్రహించాడు. ఆయన తన కోరిక తీరుస్తానని మాట ఇచ్చిన మీదట రాజు, తనకు కదళీని వివాహమాడాలని ఉన్నదని తెలియపరిచాడు.

"రాజా, నీకు నా కుమార్తె నిచ్చి వివాహం చెయ్యటానికి నాకేమీ అభ్యంతరం లేదు. కాని, ఒక్కటే జ్ఞాపకం ఉంచుకో. కదళీ, రాజాంతఃపురాలలో పెరిగినదికాదు. ఆశ్రమంలో పెరిగినది. దానికి కుట్రలూ కుత్సితాలూ తెలియవు. నువు దానిని అన్నివేళలా కంటికి రెప్పలాగా కాపాడతానంటేనే మీ కిద్దరికీ వివాహం చేస్తాను," అన్నాడు మంకణుడు.

"ఆమెను నా ప్రాణంకంటె ఎక్కువగా చూసుకుంటాను!" అని రాజు ప్రమాణం

సి. విజయలక్ష్మి

చేశాడు. త్వరలోనే మంచి ముహూర్తం చూసి మహాముని రాజుకూ, కదళికీ ఆశ్రమంలోనే శాస్త్రోక్తంగా వివాహం చేసేశాడు.

రాజు వెంట వెళ్ళిపోయే సమయంలో కదళీతో ఆమె చెలికత్తెలు, "రాజుల అంతఃపురాలు బంగారు పంజరాలని చెబుతారు. నీ కక్కడ సుఖంగా ఉంటుందో, ఉండదో! సుఖంగా లేకపోతే తిరిగి ఇక్కడికి వచ్చెయ్యి! అయితే నిన్నిక్కడ చేర్చటానికి తోడెవరూ వుండరు. అందుచేత, వెళ్ళేటప్పుడు దారిపొడుగునా ఈ ఆవాలు రాలుస్తూ వెళ్ళు. అవి త్వరలోనే మొలిచి మొక్కలవుతాయి. ఆ మొక్కలు చచ్చిపోయినా వాటి పక్కనే మళ్లీ కొత్తమొక్కలు మొలుస్తూనేవుంటాయి. వాటి ఆనవాలుతో నువు ఆశ్రమం చేరుకోవచ్చు!" అంటూ ఒక ఆవాలమూట కదళీకి ఇచ్చారు.

రాజు తన కొత్త భార్యతో బయలుదేరి మధ్యరాజ్యం చేరాడు. దారిపొడుగునా కదళీ ఆవాలు రాలుస్తూ వెళ్ళింది.

కదళీ వచ్చినదిమొదలు రాజు తన పెద్దభార్య ముఖమే చూడటం మానేశాడు. సభ చాలించగానే కదళీ వుండే మందిరానికి వెళ్ళేవాడు. అక్కడే నృత్యగాన వినోదాలు జరిపించుకునేవాడు. అక్కడే



భోజన శయనాదులు చేసి తీరికసమయాల్లో సభకు హాజరయేవాడు.

ఇదంతా చూసి పట్టపురాణికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆమె మంత్రిని పిలిపించి, "బాబూ, రాజుగారు కొత్త భార్య మోజులో పడి పట్టపురాణినైన నన్ను వదలిపెట్టేశారు. ఆవిడను తొలగించే సాధనం చూడండి!" అని కోరింది.

ఈ మాటలు మంత్రికి చెవులలో సీసం కరిగించి పోసినట్టయింది. ఆయన, "అమ్మా, అటువంటి నీచమైన పనులు చేయటానికి సన్యాసినులు బోలెడంత మంది ఉన్నారు. నన్నెందు కడుగుతారు?" అన్నాడు.

రాణి వెంటనే తన పొరపాటు తెలుసుకుని, "రాజ్యాంగానికి సంబంధించిన విషయంగదా అని మీతో చెప్పానుగాని, కూడనిపని అయితే నేనుమాత్రం ఎందుకు చెయ్యమంటానూ?" అంటూ పశ్చాత్తాపం అభినయించింది.

ఆ తరవాత పట్టపురాణి తన పరిచారికల ద్వారా ఒక సన్యాసినిని రహస్యంగా తన అంతఃపురానికి రప్పించి, దానికి అంతులేని ధనం ఆశపెట్టి, ఏవిధంగానైనా కదళీని హతమార్చే ఉపాయం చూడమన్నది.

ఈ సన్యాసిని మందులూ, మాకులూ పెట్టటంలో ఆరితేరినది. పట్టపురాణి ఇస్తానన్న డబ్బుకు ఆశపడి చిన్నరాణీని చంపటానికి మాటయిచ్చింది. కాని అంతపని తానై చేస్తే తన పీకమీదికి వస్తుందేమోనని భయపడింది. అందుచేత ఆమె ఆ ఊళ్లోనే ఉండే ఒక మంగలివద్దకు పోయి అతని సహాయం కోరింది.

"చిన్న రాణీని కడతేర్చావా, పెద్ద రాణీగా రిచ్చేదానిలో సగం నీకిస్తాను," అన్నది సన్యాసిని మంగలితో.

మంగలి కొంచెం ఆలోచించి, "చిన్న రాణీని చంపటం మాటలుకాదు. ఆమె అంటే రాజుకు పంచప్రాణాలూనూ! ఒక ఉపాయం చేయవచ్చు. రాజు చిన్నరాణీని



వదిలేసే వుపాయంచేస్తే, పెద్దరాణి తృప్తి పడుతుందేమో కనుక్కో!" అన్నాడు. సన్యాసిని పెద్దరాణీకి ఈ మాట చెప్పింది.

"చిన్నరాణీ ప్రాణాలతో వుండగా రాజు ఆమెను వదిలిపెట్టడు. అందుచేత చంపెయ్యమన్నాను. రాజు ఆమెను వదిలి పెట్టే పక్షంలో నా కంతకన్న యింకేం కావాలి?" అన్నది పెద్దరాణి.

ఒక రాత్రి మంగలి శ్మశానానికి వెళ్ళి, అక్కడ పాతేసిన శవాలతాలూకు పుర్రెలూ, ఎముకలూ కొన్ని తవ్వి మూటకట్టుకు తెచ్చాడు. ఆ మూటను తీసుకుని మంగలి పెద్దరాణీవద్దకు వెళ్ళాడు.

"అమ్మా, ఈ మనిషి ఎముకలను చిన్న రాణీగారి పాకశాలలో అటకమీద రాత్రి పూట రహస్యంగా పెట్టించండి. ఆ తరవాత రాజుగారితో చిన్న రాణీగారు పిశాచి అని తెలిసినట్టు చెప్పండి. ఇల్లంతా పరీక్షించ మనండి. ఈ ఎముకలు దొరికాక వారే నమ్ముతారు. ఆతరువాత తప్పక చిన్నరాణీని వెళ్ళగొట్టేస్తారు. అప్పుడు మీరూ మీరూ సుఖంగా వుండవచ్చు," అన్నాడు.

పెద్దరాణీ సంతోషించి మంగలికి అంతు లేని బంగారం మూటగట్టి ఇచ్చింది. మంగలి యుక్తి పారింది. కదళీ, పిశాచి అంటే మొదట రాజు నమ్మలేదు. కాని



పాకశాలలో అటకమీద మనిషి ఎముకలు దొరికాక ఆయనకు పెద్దభార్య మాటల్లో నమ్మకం కుదిరింది. ఆయన కదళిని కట్టు బట్టలతో వెళ్ళగొట్టేశాడు. కదళి అవ మొక్కల ఆనవాలునుబట్టి కాలినడకను మంకణముని ఆశ్రమం చేరుకున్నది.

రాజు తన రెండవ భార్యను వెళ్ళగొట్టే శాడన్న వార్త ఊరంతా పాక్కింది. దీని కోసం కనిపెట్టుకొనివున్న మంగలి గబగబా బయలుదేరి రాజదర్శనార్థం వెళ్ళాడు. ఒక రహస్యవిషయం రాజుగారికి స్వయంగా చెప్పాలని అన్నమీదట రాజు మంగలిని తనవద్దకు రానిచ్చాడు.

"ఎంత అన్యాయం జరిగిపోయింది, మహారాజా! ఏ పాపమూ ఎరగని ఇల్లాలిని వెళ్ళగొట్టేశారా? ఇందులో నేను తెలియక చేసిన ద్రోహంకూడా ఉన్నట్టు అనుమానం తగిలి, జరిగినది ఏలినవారికి మనవిచేసు కుందామని వచ్చాను!" అన్నాడు మంగలి.

"నువేం చేశావురా? త్వరగా చెప్పు!" అన్నాడు రాజు అదుర్దాగా.

"రెండు రోజులక్రితం పెద్ద రాణీగారు నన్ను పిలిచి, ఎక్కడన్నా మనిషి ఎముక లుంటే పట్టుకురమ్మన్నారు, మహారాజా! సరేనని తెచ్చియిచ్చాను! ఇంతపని జరుగు తుందని నాకేంతెలుసూ?" అని వలవలా ఏడవసాగాడు మంగలి.

రాజు వాణ్ణి ఊరడించి, వాడికి పెద్ద బహుమానం యిచ్చిపంపేశాడు. తరవాత పట్టపురాణిని ఖైదులోవుంచి విచారణ జరి పించాడు. చిన్నరాణీమీద కుట్ర చేసినట్టు ఆమె ఒప్పుకున్నది. రాజామెను పట్టపు రాణి పదవినుండి తొలగించాడు. తరవాత ఆయన మంకణ మహాముని ఆశ్రమానికి వెళ్ళి, మహామునికి సాష్టాంగపడి కదళికి క్షమాపణ చెప్పుకుని, ఆమెను మళ్ళీ తెచ్చు కుని, ఆమెను పట్టపురాణీ చేసి, ఆమెతో చాలాకాలం సుఖంగా జీవించాడు.



# భూగోళం—2

భూమిలో కొంత భూభాగంగానూ, మరి కొంత జలభాగంగానూ ఉండటానికి కారణం ఏమిటి? భూమి గుండ్రంగా ఉన్నప్పటికీ, దాని పైభాగం గోలికాయలాగ నున్నగా, సమంగా లేదు. దానిపైన సొట్టలూ, మిట్టలూ ఉన్నాయి. అన్నిటికన్న పెద్ద మిట్ట ఎవరెస్టు శిఖరం; దీని ఎత్తు 29,141 అడుగులని మనం అదివరకే తెలుసుకున్నాం. అన్నిటికన్న పెద్ద సొట్ట 35,600 అడుగుల లోతుగలది. కనుక మనకు తెలిసిన భూమియొక్క మందం ఈ రెంటి మధ్యా వున్న 12 మైళ్లు మాత్రమే.

ఇది భూమిలో చాలా కొద్దిభాగం మాత్రమే. నాలుగంగుళాల వ్యాసంగల వలయాన్ని సన్నని పెన్సిలు ముక్కతో గీసి, మొత్తం వలయం భూమి అనుకున్నట్టయితే, భూభాగంపై గల సొట్టలూ, మిట్టలూ సమస్తమూ ఆ సన్నని గీతలో ఇమిడి ఉంటాయి!

మాటవరసకు భూమి పైభాగం సొట్టలూ, మిట్టలూ లేకుండా నున్నగా, సమంగా, గోలి గుండులాగే అయిందనుకుందాం. అప్పుడు భూమిమీద ఉండే నీరంతా భూమిని చుట్ట వేస్తుంది. ఆ నీటి లోతు ఎంత ఉంటుందో ఊహించగలరా? 9 వేల అడుగుల లోతు ఉంటుంది! అప్పుడు భూమిమీద జలచరాలు తప్ప మరేవీ బతకలేవు.

అయితే భూమి పైపొర ఎగుడు దిగుడుగా ఉండటానికి కారణం ఉన్నది. ఈ పొర రాతిమయం. మనం పొలాలలో చూసే మట్టీ, ఎడారులలో చూసే ఇసుకా ఎంతో లోతుండవు. వీటన్నిటికీ అట్టడుగున ఉండేది రాయే. ఈ రాతిలో స్థూలంగా రెండు రకా లున్నాయి. ఒకటి తేలికైనది, రెండవది అంతకన్న బరువైనదీనూ. భూభాగం తవ్వితే దొరికే రాయి మొదటి తరగతికి చెందిన తేలికైన రాయి. ఈ రాతికి అడుగున—అనేక మైళ్ళ లోతున—రెండో రకం రాయి, బరువైనది ఉన్నది. సముద్రాల అడుగునమట్టుకు అచ్చుగా బరువైన రాయే ఉంటుంది.

మనకు భూమిమీద కనబడేదంతా తేలికైన రాయే అయినప్పుడు, ఇంతకన్న బరువైన రాయి భూగర్భంలో ఉందని మనం ఎలా చెప్పగలం? అగ్నిపర్వతాలు ప్రజ్వలించినప్పుడు లావాద్రవం రూపంలో పైకి పొంగి వచ్చేది ఈ బరువైన రాయే. గడ్డకట్టినాక ఈ శిలలను పరిశీలించినట్టయితే, మనం చూసే శిలకంటె ఇది బరువైనదని తెలిసిపోతుంది.

దీనినిబట్టి భూమిమీద కొంత భూభాగమూ, కొంత జలభాగమూ ఎందుకున్నదీ మనం తెలుసుకోవచ్చు. తేలికైన రాయిగల ప్రాంతాలు ఖండాలుగా, లేక భూభాగంగా, పైకి కని పిస్తున్నాయి, అచ్చుగా బరువైన శిలమాత్రమే గల ప్రాంతాలు పల్లంగా ఉండి, సముద్ర జలం అక్కడ చేరింది.

# పురాతన జంతువులు

సస్తన జంతువులలో అనేక జాతులు బ్రహ్మాండమైన దేహాలు పెంచుకున్నాయి. ఇలాటి వాటిలో "మెగథీరియం" అనేది ఒకటి. అమెరికాలోని ఉష్ణమండలంలో ఒకరకం జంతువు లున్నాయి; వాటికి ముందు పళ్లుండవు; అవి చెట్లమీదే నివసిస్తాయి; అవి చచ్చినా కదలవు. "మెగథీరియం" ఈ జాతికి చెందిన జంతువే; అయితే అది నేలమీద జీవించేది. అది కూచుంటే రెండు నిలువుల ఎత్తుండేది. దీనికి లావైన తోకా, బరువైన వెనక కాళ్ళూ ఉండేవి. ఇది తన ముందు కాళ్లను చేతులలాగా ఉపయోగించి, పెద్ద పెద్ద చెట్లను సయితం అవలీలగా విరవగలిగేది. ఇది కేవలం శాకాహారి. దుంపలు తవ్వి తినేది, ఆకులు తినేది. తవ్వటానికి వీలుగా దీనికి బలమైన గోళ్లుండేవి. దీని నాలుక పొడవుగా, బలంగా ఉండేది.

"గ్లిప్టోడన్" అనేది కవచంగల జంతువు. ఈ జాతిలో కొన్ని ఎద్దులంత పెద్దవిగా ఉండేవి. దీని తలపైనా, వీపుమీదా, తోక చుట్టూ ఎముకల కవచం ఉండేది. దాని తోక చివర ములుకులుండేవి.

భూమిమీద నివసించిన సస్తన జంతువులన్నిటిలోకీ బ్రహ్మాండమైనది "బలూచి థీరియం". ఆసియా ప్రాంతంలో నివసించిన ఈ జంతువు ఈనాటి ఖడ్గమృగాలకు అది బంధువు. ఇది ఈనాటి జిరాఫ్ అంత ఎత్తుండేది; చాలా బరువుండేది.



మెగథీరియం

సస్తన జంతువులలో కొన్ని జలచరాలుకూడా ఉండేవి. వాటిలో చాలా పెద్దది "జూగ్లోడన్". ఇది 80 లేక 90 అడుగుల నిడివి ఉండి, చాలా సన్నగా ఉండేది. ఈనాటి తిమింగిలాలకిది దగ్గర బంధువు.

పురాతన సస్తన జంతువులన్నీ పూర్తిగా అంతర్ధానం కాలేదు. వాటిలో కొన్ని పరిణామంద్వారా ఈనాటి జంతువులుగా మారాయి.

ఇలాటి పురాతన జంతువులనూ, వాటి పరిణామదశలనూ మరొకమారు తెలుసుకుందాం.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : రూపులు వేరైనా...

రెండవ ఫోటో : మనమందర మొకటేనే!

పంపినవారు : యస్. వి. రమణ పట్నాయక్, సెంట్రల్ స్టోర్స్, ఖర్గపూరు

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




## జ్ఞానంగల చేప

ఐంద్రజాలికుడు ప్రేక్షకులతో, తాను చేపలకు చీట్లపేకముక్కలు గుర్తించే విద్య నేర్పానంటాడు. ఇదివిని అందరూ ఆశ్చర్యపోతారు.

స్టేజి మధ్యభాగంలో వెనుకతెరకు దగ్గిరగా ఒక బల్లమీద ఒక గాజు పాత్ర—వినోదపు చేపలనుంచేలాటిది-పెట్టి వుంటుంది. అందులో ఈదుతూ అనేక "బంగారు" చేపలు కనబడుతూంటాయి. ఐంద్రజాలికుడు ఒక చీట్లపేక తీసి, ప్రేక్షకులను బాగా కలపమని, తరువాత దానిని గాజుపాత్రలోని నీటిలో పడవేస్తాడు. తరవాత ప్రేక్షకులను పేకముక్క ఏదో ఒకటి కోరుకోమని అడుగుతాడు. మాటవరసకు వారు ఇస్పేటాసు కోరారనుకుందాము. ఐంద్రజాలికుడు చేపలకేసి తిరిగి ఇస్పేటాసును చూపమని అడుగుతాడు. ఆశ్చర్యం! కొద్ది క్షణాల్లోనే, ఈదుతున్న బంగారు చేపలలో ఒకటి ఇస్పేటాసు ముక్కను తన నోటితో పట్టి పైకి ఎత్తుతుంది. ఇది అందరూ కళ్ళారా చూసి విస్మయం చెందుతారు. (1-వ బొమ్మ చూడండి.)

ఇక ఇందులోని రహస్యమేమంటే-గాజుపాత్ర పైకి మామూలు పాత్రలాగే కనిపిస్తుందిగాని, అది ప్రత్యేకంగా తయారుచేసినది. దాని అడుగున



గుండ్రని కంత పెట్టి, ఆ కంతలో ఒక గాజుగొట్టంగాని, సెల్యులాయిడ్ గొట్టం గాని అమర్చుతారు. వలయంలో చూపిన బొమ్మలో A వున్న భాగం కత్తిరించినది, B వరకూ నీరు నించ వచ్చు. ఆ నీరు గాజుపాత్రకూ, లోపలి గొట్టానికీ మధ్యభాగంలో ఉంటుంది. నీరు నించాక, లోపల గొట్టం ఉన్న సంగతి ఎవరూ పసికటలేరు! ఎందుకంటే ఆ గొట్టంకూడా గాజుదే ! నిజమైన "బంగారు" చేపలు ఈ గొట్టం చుట్టూ ఉండే నీటిలో ఈదులాడుతూ ఉంటాయి. ఇంద్రజాలికుడు చీట్లపేక ముక్కలు వేసేదికూడా ఈ నీటిలోనే.




తరువాత, సమకోణంలో వంచిన పొడుగాటి సెల్యులాయిడ్ బద్ద ఒకటి సంపాదించాలి. దీని కొసను బొమ్మ "బంగారు" చేప ఒకటి అమర్చి వుంటుంది. దానిని సెల్యులాయిడ్‌తో గాని, ఇతర పదార్థంతోగాని చేయవచ్చు. ప్రేక్షకులు కోరిన ముక్క దాని నోట అమర్చి వుంటుంది. ఈ బొమ్మ చేపను కదిలించేవాడు, తెర వెనుక, ప్రేక్షకులకు కనబడకుండా కూచుని వుంటాడు. (2-వ బొమ్మ చూడండి.) నిజమైన బంగారు చేపలన్నీ నీటిలోనే ఉంటాయిగాని ఈ బొమ్మ చేప వుండే చోట నీరుండదు. ఇది ప్రేక్షకులు గుర్తించలేరుగనక, వారీ బొమ్మ చేపనుకూడా నిజమైన చేపగానే భావిస్తారు. తెర వెనక కూచున్నవాడు అవసరమైన పేక ముక్కను తీసి బొమ్మ చేప నోట అమర్చి, గాజుపాత్ర అడుగు భాగం నుంచి పైకి ఎత్తుతాడు. గాజుపాత్రకు అడుగులేని చోట బల్లలోనూ, బల్లమీద పరిచిన బట్టలోనూకూడా కంతలుంటాయని వేరే చెప్పనవసరంలేదు. తెర వెనక ఉన్నవాడు బొమ్మ చేపను, యీదుతున్నట్టుగా అటూ యిటూ తిప్పుతాడు.



# అట్టచివరి బొమ్మ

ఒకరోజు రాజు - 2

అబూ చెప్పిన ఆ మాటలు విని ఖలీఫా ఇలా అన్నాడు:

"మీ ప్రవర్తన నాకు సమంజసంగానే కనబడుతున్నది. ఆస్తిలో సగం మిగిల్చి ఉంచుకోవటం మీ జాగ్రత్తను సూచిస్తోంది. మీ స్నేహపాత్రతలోకూడా లోటేమీ లేదు. రోజుకొక కొత్త వ్యక్తితో స్నేహం చేసుకుంటున్నారు. ఒక్కటే నన్ను బాధిస్తోంది. ఈ ఆతిథ్యానికి ఏదైనా ప్రత్యుపకారం చేద్దామనుకున్నాను. కాని మీరేమో రేపు ఉదయమే వీడ్కోలు చెప్పేస్తామంటున్నారు. నావంటి మిత్రుడు తీర్చగలకోరిక మీకేదీలేదా?"



"మీతో ఇలా సరదాగా సంభాషించటంకంటె నాకు మీనుంచి కావలిసినదేమీ లేదు. నాకు జీవితంలో ఒక ఆశగాని, కోరికగాని లేదు. నేను ఎవరినుంచీ ఏ సహాయమూ ఆశించను. అందుచేత మీరు నాకు ప్రత్యుపకారం చేసే విషయం తలపెట్టనేవద్దు," అన్నాడు అబూ.

మరి కాస్సేపు ఇద్దరూ మాట్లాడినాక ఖలీఫా, "మీ సంతుష్టి నిజంగా ఆశ్చర్యంగానే వుంది. మీరింకొకరినుంచి ఏ సహాయమూ కోరకపోతే అందులో వింత ఏమీలేదు; కాని మనిషి అన్నాక ఏ కోరికా ఉండకుండా ఉండదు. తీరినా తీరకపోయినా కోరికలు ఉండి తీరుతాయి. మీవంటి వ్యక్తిలో యెటువంటి కోరికలుంటాయో తెలుసుకోవాలని నాకు కుతూహలంగా ఉంది. స్నేహపూర్వకంగా చెబితే విని సంతోషిస్తాను," అన్నాడు.

అబూ కొంచెంసేపు ఆలోచించి నవ్వుతూ, "నాకు ఒక్క కోరిక ఉన్నమాట నిజమే. కాని అది తీరేదికాదు. ఒక్క రోజు ఖలీఫా కావాలని నాకు కోరిక ఉన్నది," అన్నాడు.

"ఖలీఫా అయి ఒక్క రోజులో ఏమి సాధిద్దామని?" అని అడిగాడు ఖలీఫా ఆత్రంగా.

"బగ్దాద్ నగరంలో నాలుగు పేట లున్నాయి. నాలుగు పేటలకూ నలుగురు దండనాయకులు పాలకులుగా ఉన్నారు. మా పేటకు పాలకుడుగా వున్నవాడు వట్టి పశువు, పాపాత్ముడు, సంస్కారం ఏకోశానా లేనివాడు. ఈ దుర్మార్గుడి పాలనలో ఏ స్త్రీయొక్క సౌశీల్యానికీ ఆదరణ లేదు. ఈ పాపాత్ముడు మా పేటను నరకంకన్న ఘోరంగా చేస్తున్నాడు. వీడికి కుడి చెయ్యీ, ఎడమ చెయ్యీలాగా ఇద్దరు పరమనీచులున్నారు. నేను ఒక్క రోజు ఖలీఫా కాగలిగితే నా, నాకు ధన మక్కర్లేదు, అధికారం అక్కర్లేదు, కాని ఈ ముగ్గురు నరపశువులనూ కొరత వేయించి, మా పేటకు చుట్టుకున్న శని విరగడచేతును!" అన్నాడు అబూ.

ఈ మాటలు వినేసరికి ఖలీఫాకు అబూ మీద గల సద్భావం మరింత పెరిగింది. ఎందుకంటే దుష్టులైన అధికారులపై ఆగ్రహం కలిగేది ఎప్పుడైనా సజ్జనులకేగాని సామాన్యులకు కాదు.

ఖలీఫా అబూ కోరిక తీర్చ నిశ్చయించుకుని, అతను చూడకుండా అబూ పానీయంలో మత్తు మందు కలిపి తన చేత్తో అందించాడు. అది తాగుతూనే అబూ అల్ హసన్ స్పృహ తప్పి పడిపోయాడు. ఖలీఫా అబూను తన బానిసచేత మోయించి తెల్లవారే లోపుగా రాజసౌధానికి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఉదయం అబూ అల్ హసన్‌కు స్పృహవచ్చేసరికి అతను ఖలీఫా శయ్యాగారంలో హంసతూలికా తల్పంమీద పడుకునివున్నాడు. అద్భుతమైన దుస్తులు ధరించిన దాసదాసీజనం అతన్ని చూడగానే తలలు వంచారు. వాకిలిపద్ద ఖలీఫాగారి దర్శనార్థం వచ్చిన వజీర్లూ, సామంతులూ నిలబడి వున్నారు. బల్లపై ఖలీఫా ధరించవలసిన దుస్తులూ, తలపాగా మొదలైనవి పెట్టి వున్నాయి. (ఇంకావుంది)





# వార్తలు-విశేషాలు

ఈ ఆర్థిక సంవత్సరంలో గ్రంథాలయాల అభివృద్ధినిమిత్తం భారతప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలకు గ్రాంట్లకింద 35,37,473 రూపాయలు మంజూరుచేసింది. మన దేశంలో వున్న 32 వేల గ్రంథాలయాలలో 71 లక్షల పుస్తకాలున్నాయి.

*　　*　　*　　*

భాక్రా-నంగాల్ ప్రాజక్టువల్ల రాజస్థాన్ రాష్ట్రానికి 1957-వ సంవత్సరంలో విద్యుచ్ఛక్తి లభించగలదని, కేంద్ర విద్యుత్‌శాఖా మంత్రి శ్రీ జైసుఖ్‌లాల్‌హతి ప్రకటించారు.

*　　*　　*　　*

వెనక ఇండియా ఆహారశాఖ డిప్యూటీ మంత్రిపదవిని నిర్వహించిన శ్రీ మొసలికంటి తిరుమలరావుగారిని, వింధ్యప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్‌గా ప్రెసిడెంట్ ప్రసాద్ నియమించారు. ప్రస్తుతం ఆ పదవిని నిర్వహిస్తున్న శ్రీ కె. సంతానం ఆ పదవినుంచి విరమించారు.

*　　*　　*　　*

కాశీ-కన్యాకుమారి జాతీయ రహదారికి కర్నూలువద్ద తుంగభద్రనదిపై వంతెన నిర్మాణానికి, ఇండియాప్రభుత్వం 26,17,000 రూపాయలను మంజూరు చేసింది. ఈ వంతెన నిర్మాణంతో ఆంధ్ర, హైదరాబాద్ రాష్ట్రాలమధ్య చక్కని రవాణాసౌకర్యాలు ఏర్పడగలవు.

*　　*　　*　　*

గాంధీమహాత్ముని జ్ఞాపకార్థం, దేశంలోని వివిధప్రాంతాలలో 20 లక్షల రూపాయల వ్యయంతో 100 'గాంధీ ఘర్'లను నిర్మించటానికి, అఖిలభారత గాంధి స్మారకసంఘం నిర్ణయించింది.



సంస్కృతి, నాగరికతల పుట్టుపూర్వోత్తరాలను తెలిపే, పురాతత్వ విషయక ప్రదర్శనం అహమద్‌నగర్ జిల్లా నేవాసాలో జరుపబడుతుంది. పూనాలోని దక్కన్ కాలేజి రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌వారు దీనిని ఏర్పాటుచేస్తున్నారు. ఫిబ్రవరి 2-వ తేదీనుంచి 10-వ తేదీవరకు జరిగే ఈ ప్రదర్శనంలో అనేక అపూర్వ వస్తువులు ప్రదర్శింపబడగలవు.

*　　*　　*　　*

తుంగభద్ర ప్రాజెక్టుకింద భూముల అభివృద్ధి నిమిత్తం పది సంవత్సరాలవరకూ, ఏటా 5,40,000 రూపాయల మొత్తాన్ని కేంద్రప్రభుత్వం, హైదరాబాద్ ప్రభుత్వానికి ఇవ్వగలదని తెలుస్తున్నది. ఈ ప్రాజెక్టుకింద మునిగిపోయిన 37 గ్రామాలవారి పునరావాసానికి రాష్ట్ర ప్రభుత్వం 55 లక్షల రూపాయలు ఖర్చుపెట్టింది.

*　　*　　*　　*

యూనియన్ ప్రభుత్వం ఏర్పాటుచేసిన అఖిల భారత సాంకేతిక విద్యా సంఘంవారు, ఉన్నత సాంకేతిక విద్యాభివృద్ధికి పంచవర్ష ప్రణాళికను రూపొందించారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో, సాంకేతిక విద్యాసంస్థల అభివృద్ధికి మొత్తం 18,577 లక్షల రూయలు కేటాయించబడినట్టు తెలుస్తున్నది.

*　　*　　*　　*

విజయవాడలో పారిశ్రామిక గృహనిర్మాణ పథకం కింద నిర్మింపదలచిన వెయ్యి గృహాలలో, మొదటగా 100 యిళ్ళు ఈ సంవత్సరంలో నిర్మింపబడగలవు. ఈ పథకాన్ని అమలు పరచడానికి 6 లక్షల రూపాయలు ఖర్చుకాగలవని అంచనా వెయ్యబడింది. ఈ మొత్తాన్ని నగం అప్పుగాను, మిగతా నగం గ్రాంటుగాను కేంద్రప్రభుత్వం మంజూరు చేస్తుంది.

*　　*　　*　　*

కళాఖండాల కొనుగోలు సంఘం సమావేశం 1956 ఫిబ్రవరి 10, 11 తేదీలలో లక్నోలోని గవర్నమెంట్ మ్యూజియమ్‌లో జరుగుతుంది. న్యూ ఢిల్లీలోని జాతీయ చిత్రవస్తు ప్రదర్శనశాల, జాతీయ అధునిక కళాఖండాల ప్రదర్శనశాలల నిమిత్తం కళాప్రధానమైన చిత్రాలను, శిల్పాలను, అమూల్యమైన వ్రాతప్రతులను ఈ సంఘం ఖరీదుచేస్తుంది.



# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు గాలం తీసుకుని నదికి బయలు దేరారు. వీలయితే తిమింగిలం అంత పెద్ద చేపను పట్టాలని వాళ్ల అలోచన. 'టైగర్' కూడా వెనకనే బయలు దేరింది. అది పొరపాటున నదిలోపడి మునిగి పోకుండా దాని నడుముకు ఒక రబ్బరు ట్యూబు కట్టారు. ఎంతసేపు కూర్చున్నా దాసూ వాసూల గాలానికి చేప పడలేదు. కాని 'టైగర్' నదిలో దూకి పట్టిన చేపతో, వాళ్ల గాలంలో పడింది. ఎట్లయితేనేం; చివరకు వాళ్లు చేపను పట్టారు!





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మనమందర మొకటేనే!

పంపినవారు :
యస్. వి. ఆర్. పట్నాయక్, ఖర్గపూరు

57

